విడిప్రతిక ౧ అణా

# గోలకొండపత్రిక

102575

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ | జూన్ ౨౫ వ తేది ౧౯౩౬ గురువారము | అర్ధ సం॥ చందా ౪

సంపుటము ౧౧ | త్రూపుబజారు, హైద్రాబాదు - దక్కన్. శా. శ. ౧౮౫౮ శ్రీ ధాత సం॥ ఆషాఢ శు ౬ గురువారము. ౨౦ అమర్దాదు ౧౩౪౫ ఫ. | సంచిక ౧౪

## పంచదార పరిశ్రమ

పి. వి. రమణా రావు గారు

బి. యస్సి. (ఆనర్సు) టెక్నాలజీ

### మూడవఅధ్యాయము

### హిందూదేశములో చెరకుపంట

#### పూర్వకథా ప్రసంగము

ఇదివరకు పంచదార పరిశ్రమయొక్క ప్రాముఖ్యతనుగురించియు ఈపరిశ్రమకు వాటిల్లిన కష్టసుఖములనుగురించియు వివరించితిని. ఇప్పుడు ఈపంచదారను తయారుచేయుటకు కావల ...ను గురించియు, ఈపంట వృద్ధిలోనికి ...వడియు, ఇప్పుడు . ఎంతవరకు ...యు తెలిసికొనవలసియున్నది.

#### ...రనిచ్చు మూలపదార్థము

...దార తియ్యటిపదార్థమని చంటిబిడ్డలకు ...లిసినవిషయమే. పంచదారను మనము ... ఒక పదార్థమునకు మాత్రమే వా...నిఇంగ్లీషులో "షుగర్సు" అని కొ...లు కలవు. ఇవి కొన్ని రసాయ...ము. క్కావుత, ...న్ని పదార్థములు. కాని ఇంగ్లీషు ...షుగర్" అని ఉపయోగించినప్పుడు మనము సాధారణముగా పంచదారయని యే అర్థము చేసికొందుము. ఈచక్కెరలో నుండుముఖ్యపదార్థమును (Sucrose) సూక్రోజు అందురు. ఈసూక్రోజు నూటికి ౯౪ మొదలు ౯౯.౬ పాళ్లవరకు సాధారణముగా చక్కెరలోనుండును. మిగతవి మరికొన్ని పదార్థములతో కలసియుండును. ప్రతి తియ్యటి పదార్థములోను ఈసూక్రోజు ఉండును. పండ్లన్నియు చాలవరకు తియ్యగానుండును. ఐనచో ఈపదార్థములలోనుండి మనము పంచదారను తీయకూడదాయని యడుగుదురేమో? అట్లు తీయవచ్చునుగాని వాటిలోనుండు సూక్రోజు చాల తక్కువగనుండును. ఎన్నివేల పండ్లకో మనము డబ్బు వ్యయపరచినగాని మనకు ఒక సౌను చక్కెర వచ్చుట అరుదు. లాభము లేకపోవుట కుబదులు మనకెంతయో నష్టముగలుగును. మన దేశములో నున్న ౩౫ కోట్ల ప్రజలకు అందరకు మనిషికి సుమారు ఏడాదికి ౫-౧౦ సౌనుల వరకు చక్కెరను అమర్చవలెననిన ఎన్నిపండ్లు కావలెనో ఆలోచించుకొనుడు. అందుచే మనము పెద్దపరిశ్రమను సాగింపవలయునని దానివలన ప్రజలకు సౌఖ్యము ఉంచవలెను. ప్రజలకు, వ్యవసాయదారులకు, పరిశ్రమలవారికి కూడ అంతో ఇంత లాభమురావలయును. దానివలన మనదేశప్రజలలో కొందరు భుక్తిగడపవలసియున్నది. ఏపనిచేసినను అది ఉపయోగకరముగాను, లాభకరముగాను ఉండవలయును ఇకనుమిక్ గా అనగా తక్కువ ధన, వ్యయ ప్రయాసములతో ఎక్కువ లాభించునదిగ నుండవలెను. కాని ఇట్టి సదుపాయములను గూర్చు వస్తువులీ ప్రపంచములో కొన్నిమాత్రమే ఉండును. అందులోను వాటిలో మరల పోటీవచ్చుచుండును, అట్టి పోటీలలో గెలుపొంది ఘనతకువచ్చునదేదో యొకటి మాత్రముండును. దానిని కనిపెట్టుట దుర్లభము. దేశకాల పరిస్థితులనుబట్టి ఒక్కొక్కటి ఘనతను వచ్చుచుండును

#### చక్కెరనీయగల ఇతరవస్తువులు

మనదేశములో చెరకుపంట యొక్కువ లాభకరముగా నున్నది ఇది మన దేశపరిస్థితులకు చాల అనుకూలముగానుండి దేశమంతటను కూడ వ్యాపింపగలదిగ నున్నది. మనదేశములో ఈ చెరకు ఒక్కటేకాక తాటిచెట్లనుండి కొబ్బరి తెల్లనిపాలనుండి బెల్లమును తయారుచేయుట చాలకాలమునుండిగలదు. కొబ్బరిచెట్లుగూడ ఇందులకుపయోగించుచున్నవి. జొన్న మొక్కజొన్న చెట్ల దవ్వలు చాల తియ్యగానుండును. వాటిలోగూడ కొంతవరకు సూక్రోజు ఎక్కువగానే యుండును. వాటినుండికూడ పంచదార చేయుట కొంతవరకు లాభమేకాని చెరకుతో పోటీకిరాలేవు. వాటినుండి పంచదార చేయకపోయినను, వాటిలోని మంచిగుణములను కొన్ని చెరకుగుణములతో గలిపి కొన్ని క్రొత్తరకము చెరకులను వృద్ధిచేయుచున్నారు. వీటినిగురించి ముందు వివరింపబడును.

జర్మనీ మొదలగు కొన్నిదేశములలో బీటు పరిశ్రమ ఎక్కువగానున్నదని ఇదివరలో చెప్పితిని. ఈబీటు రూటు, మనముపయోగించు చిలగడదుంపవలె నుండును. దుంప కోలగాను, లావుగాను, ఉండి వ్రేళ్ళతో నిండియుండును. భూమిపై ఆకులు దట్టముగానుండును. ఈ దుంపలో నూటికి ౧౬ మొదలు ౨౦ పాళ్లవరకు సూక్రోజు కలదు. అందుచే ఇది చాల ఉపయోగకరముగానున్నది.

అమెరికా ప్రాంతములలో మాపిల్ ("Maple Trees") చెట్లనుపెంచుదురు. వీటినుండి పాలుతీసి పంచదారను వండుదురు. మొక్కజొన్నకూడ విరివిగా అమెరికాలో ఇదివరకు పంచదార నిమిత్తమై వాడబడినది. మాపిల్ చెట్లలో అనేకరకములు గలవు. అవన్నియుకూడ లాభకరముగానే ఉపయోగపడుచున్నవి.

పై పేర్కొనబడిన వాటికన్నిటిలోకి చెరకు, బీటుమాత్రమే పరిశ్రమకు చాల లాభకరముగా వాడబడుచున్నవి. ఈదిగువ పట్టికను చూచిన ప్రపంచమునందు ఈరెండును ఎక్కడెక్కడ వ్యాపించియున్నవో తెలియనగును.

| చెరకు | బీటు | చెరకు | బీటు |
|---|---|---|---|
| స్పెయిను | జర్మనీ | మదీరా | ఆస్ట్రియా |
| లూసియానా | హంగరీ | సౌతుఆఫ్రికా యూనియను | నెదర్లాండ్సు |
| ఫ్లోరిడా | పోలండు | మారిషస్ | ఇటలీ |
| ట్రినిడాడు | స్పెయిను | మొజాంబిక్ | బల్గేరియా |
| పోర్టోరికో | డాంజిగ్ | మెడగాస్కర్ | స్విడ్జరులాండు |
| బార్బడోసు | ఫ్రాన్సు | అంగోలా | ఫిన్లాండు |
| హవాయి | డెన్మార్కు | కెన్యా | అజోర్సు |
| జమైకా | జుగోస్లేవియా | సోమాలిలాండు | లట్వియా |
| వర్జిన్ ఐలండ్సు | రుమేనియా | క్వీన్సులాండు | ఇంగ్లాండు |
| క్యూబా | జుకోస్లావేకియా | న్యూసౌత్ వేల్సు | టుర్కీ |
| మెక్సికో | బెల్జియము | ఫిజి ఐలాండ్సు | యునైటెడ్ స్టేట్సు |
| సెంట్రల్ అమెరికా | స్వీడెన్ | బ్రిటిషు ఇండియా | కనడా |
| బ్రిటిషు గయానా | ఐరిష్ ఫ్రీస్టేటు | ఫిలిప్పైను ఐలండ్సు | అర్జెంటైనా |
| డచ్చి గయానా | (ఆస్ట్రేలియా) | చైనా | జపాన్ |
| అర్జెంటైనా | విక్టోరియా | ఇండోచైనా | |
| బ్రెజిల్ | | జావా | |
| పెరు | | జపాను | |
| దక్షిణ అమెరికా | | ఫార్మోజా | |
| ఈజిప్టు | | | |

బీటుచక్కెర, చెఱకు చక్కెర ఎంత దిగుమతి యగుచున్నది ఈ దిగువ చూడనగును.

| సంవత్సరము | ౧౯౨౭-౨౮ | ౧౯౨౮-౨౯ | ౧౯౨౯-౩౦ | ౧౯౩౦-౩౧ |
|---|---|---|---|---|
| బీటు చక్కెర (మెట్రిక టన్నులు) | ౯౧౪౨౦౦౦ | ౯౫౯౪౦౦౦ | ౯౩౩౨౦౦౦ | ౧౧౪౧౩౦౦౦ |
| చెరకు చక్కెర (మెట్రిక టన్నులు) | ౧౪౫౩౩౦౦౦ | ౧౯౨౮౬౦౦౦ | ౧౯౧౨౮౦౦౦ | ౧౮౦౦౪౦౦౦ |
| మొత్తము (మెట్రిక్ టన్నులు) | ౨౩౬౭౫౦౦౦ | ౨౮౮౮౦౦౦౦ | ౨౮౪౬౦౦౦౦ | ౨౯౪౧౭౦౦౦ |

#### చెఱకుపైరు చేయుపద్ధతి

ప్రస్తుతమునను బీటుహూటునుగురించియు, ఇతరవృక్షములను గురించియు వదలిపెట్టి, మనహిందూదేశమునకు ముఖ్యమగు చెరకు పంటనుగూర్చి కొంత తెలిసికొనవలసియున్నది. ఈచెఱకుకూడ ఒకవిధముగా గడ్డిచెట్లజాతికి చెందినదనిచెప్పవచ్చును. గోధుమ, మొక్కజొన్న, సరి వెదురైనవాటితరగతికిచెందినది ఈచెరకు. కానివీట అన్నిటికన్నలావుగాను, పొడుగుగాను పెరుగును. అందుచేతనే వీటిని చెరకుగడలందుము. కొన్నికొన్నిగడలు ౨౦ అడుగులపొడుగుకూడ ఉండును. గోదావరిడెల్టాభూములలో సామాన్యముగా ఈచెరకుగడ ౩-౪ అంగుళములచుట్టు కొలతయు, ౧౬-౧౭ అడుగులపొడుగును ఉండును. ఉష్ణప్రదేశములలో ఈచెరకుపువ్వుకూడ పూయును. కాని అన్ని ఉష్ణప్రదేశములలోను పూయదు. ఆపువ్వు పూయుటకు కొన్నిశీతోష్ణపరిస్థితులు సరిపోవలయును. అందుచేతనే ఈచెరకు విత్తనములనూలముగా వ్యాపించుటలేదు. చెరకుగడనే ముక్కలక్రిందకోసి నాటుదురు. ఇట్లునాటుటకై

౨ వ పేజి చూడుడు

హైద్రాబాదు ౧౭ అమర్దాదు

మోతీమహల్ టాకీస్ అగ్నిప్రమాద విచారణకై ప్రభువుగారి ఆజ్ఞానుసారము ఈ క్రిందివారు సభ్యులుగా గల కమిషను (విచారణ సంఘము) ఏర్పడినది. శ్రీ యుతులు, నవాబు రహమతుయార్జంగు బహాదరు, యస్. టి. హాలిన్సు, నవాబు జైనుయార్జంగు, అర్మ్‌స్ట్రాంగ్, బహాదరు యార్జంగు బహాదరు, పండిత శ్రీపతరావుగారలు.

౧౭ అమర్దాదు రోజు ప్రొద్దున ౧౧ గం. ఈ కమిషను మోతీమహలు టాకీసులో కూడుకొని, థియేటరు, స్త్రీలస్థలమునకు పోవు మెట్లు, క్యాబిన్ మొదలగువానిని ఒకగంటవరకు పరిశీలించెను.

## మొదటిరోజు విచారణ

సుల్తానుబజారు సదరు అమీన్ కచేరీలో మిస్టర్ యస్. టి. హాలిన్సుగారి అధ్యక్షతన కమిషను విచారణ ప్రారంభించెను.

ఈవిచారణ జరుగుసభలో ప్రజలనుగూడ రానిచ్చినందున, జనసమ్మర్దము రాజమార్గమువరకుండెను. ఆరోజు మోతీమహలుయొక్క జనరలుమేనేజరు, మేనేజరు, అసిస్టెంటు మేనేజరు, ఆపరేటరు (యంత్రము నడుపువాడు,) విద్యుచ్ఛక్తి ఉద్యోగి ఈ ౫గురి వాఙ్మూలములు మాత్రమే తీసికొనబడెను.

### జనరల్ మేనేజరు సాక్ష్యము

"నిప్పంటుకొన్నరోజు ౯ గం. ౩౦ని. లకు థియేటరువిడిచితిని: కేబినులో వేరేఫిల్ములు లేకుండెను. ఈటాకీకిగూడ ప్రధానకార్యాలయము జమ్రుదులో నున్నది. ఉత్తర ప్రత్యుత్తరముల నక్కడనుండియే చేసెదను. ఏథియేటరుకొరకు తెప్పించిన ఫిల్ములను అక్కడికే పంపుచుందును. ఆరోజు ఫిల్ము మాటిమాటికి తెగిపోవుచుండుట ఆపరేటరు గమనించియుండెను. నిప్పంటుకొనగానే చల్లార్చ ప్రయత్నము చేసెను. స్త్రీలుండుభాగమునకు వెళ్లి వారిని రక్షింప ప్రయత్నించెను. ఒకపిల్లవానిని రక్షింపనుగూడ రక్షించెను. భవనము భీమా చేయబడినది తెలియదు. ౯వేల విలువగల కొన్ని సామానులు భీమా చేయబడినవి. థియేటరు ౧౭౦౦ల చొప్పున ౫ఏండ్లవరకు కొంటిని. నిప్పంటుకొనినప్పుడు ౫౭౦ మందియుండెను. మొత్తము ప్రేక్షకులు ఉండిరి. వర్షాకాలమున అప్పుడప్పుడు విద్యుచ్ఛక్తి చెడిపోవుచుండును" అని మేనేజరు భగత్ సింగుగారు వాఙ్మూలమిచ్చిరి.

### మేనేజరు వాఙ్మూలము

తర్వాత, మేనేజరగు రామదేవ్ గారు వాఙ్మూలమిచ్చిరి. వారీక్రింది విషయములను తెలిపిరి.

"నేనీపనిని మూడు సంవత్సరములనుండి నిర్వహించుచుంటిని నిప్పంటుకొన్నపుడు నేను ఆఫీసులోనే యుంటిని. లొల్లివిని లోనికిపోయి నిచ్చెనలు తెప్పించి స్త్రీలకు సాహాయ్యము చేసితిని. మా ౨౫-౩౦ మంది నౌకర్లు అందుకే వినియోగపరుచబడిరి. నిప్పు మొదట క్రిందిసోఫాలకును తెరలకును అంటుకొనెను. అకోలలు మాసికపోయెను. ఫిల్ము చెడస్థితిలోనున్నటుల ఆపరేటరు చెప్పలేదు. తన దినచర్య పుస్తకములోకూడా వ్రాయలేదు. రక్షక శాఖవారు నిప్పంటుకొన్నతర్వాత వచ్చిరి. నిప్పు చల్లార్పు ఇంజను అవలనే ఆగియుండెను. నేను స్వయముగా ౪-౫ మంది స్త్రీలను దింపితిని. పురుషులు అవలకు పరుగెత్తిరి. ౨-౩ నిమిషములలోనే నిప్పంటుకొని చల్లార్పజాలనంతటి స్థితికివచ్చినది.

### విద్యుచ్ఛక్తి ఉద్యోగి సాక్ష్యము

"నిప్పంటుకొన్నపుడు నేను "డైనమో" గదిలో నుంటిని. అది మంచిస్థితిలో నుండెను. నిప్పంటుకొని పొగరాగా, దీపము, చల్లార్పి స్విచ్‌బోర్డు నిప్పును మంటితోను, తర్వాత నిప్పుతో చల్లార్చితిని. నిప్పంటుకొనగానే ఫ్యూజు ఎగిరిపోయెను" అని విద్యుచ్ఛక్తి సంబంధమైన పనిచూచు, కేశవులు వాఙ్మూలములో తెలిపెను.

# మోతీమహల్ దురంతవిశేషముల విచారణ

## సాక్ష్యము లిచ్చినవారలు తెల్పిన విషయములు

### మిషన్‌మెన్ సాక్ష్యము

తర్వాత మిషనునడుపు భగత్ అనువతడు తన వాఙ్మూలములో నిటుల దెలిపెను.

"నేను ౯ ఏండ్లనుండి పనిచేయుచున్నాను. ఆరోజు నా సహాయుడుగూడ వెంటనుండెను. ఆట పూర్తియగుటకు ౧౫-౧౭ అడుగుల ఫిలిము మిగిలియుండగా, మొదటి తరగతిలో నిప్పంటుకొన్నది చూచితిని. వెంటనే యంత్రము మాపి, "ఫైర్ యస్టింగ్విషర్"తో నిప్పు చల్లార్ప ప్రయత్నించితిని, మ్యాటినీషో సమయములో నిప్పంటినప్పుడు ఫిల్ము బాగుగానేయుండెను. నిప్పులేచుటకు మొదలు, తంతికాలినట్లు వాసనరాలేదు. ఫిలిము తెగిన నిప్పంటుకొనును కాని, అడిమ్మాకు, ప్రొజెక్టరు ఆపివేయకున్నచో, ఈఫిల్ము రెండుసార్లు తెగెను. కాని ఈ ఆటలో మాత్రముగాదు. నేను నీటికై క్రిందికివచ్చి స్త్రీలను రక్షింప మీదికిపోయి ఒకపిల్లవాని నెత్తుకొనివచ్చితిని. పొగవల్ల మిషను చెడిపోయెను. ఒకరీలుగూడ కాలిపోయెను."

## రెండవరోజు విచారణ

హైద్రా. ౧౮ అమ.

నేడుకూడా నిన్నటివలె కమిషన్ ౧౦ గంటలకు సుల్తానుబజారులో రక్షకశాఖవారి కార్యాలయమున కార్యక్రమము ప్రారంభించెను. ప్రేక్షకుల నేకులుండిరి. ౯ వాఙ్మూలములు తీసికొనబడెను. థియేటరుకాలినపుడు ఆటచూడవచ్చి ఇద్దరుముగ్గురు వాఙ్మూలముల నిచ్చుటకువచ్చిరి. కానికమిషన్ వారంగీకరింపలేదు.

### ఒక ప్రేక్షకునిసాక్ష్యము

హనుమాన్‌ప్రసాదు అను ప్రేక్షకుని స్వప్రమాణవాఙ్మూలము ఇట్లున్నది.

"సోఫాలకు సమీపముననే కూర్చునియుంటిని ఒకపటాకువేసినట్లు చప్పుడువచ్చెను. మంటగూడా కనుపడెను. మేమందరము బయటికి వచ్చితిమి. పోలీసులు నిచ్చెనలు పెట్టుచుండిరి. రెండవతరగతిలో అందరునిండియుండిరి. ఇంతలో స్త్రీల మార్గము వైపు స్త్రీలను దింపుటచూచితిని. స్త్రీలరోదనము వినరాలేదు. నేనుచివరకు పంచునామాయగువరకుంటిని ఫైరుఇంజను నీరు, మంటతగిలిన ౪౫ నిమిషములకువచ్చినది."

### రక్షకశాఖ సదరమీన్ గారి వాఙ్మూలము.

రక్షకశాఖ సదరమీన్ గారు స్వప్రమాణము గనిట్లుచెప్పిరి:

"ఆదివారమునాటిరాత్రి ఆటచూచుచుంటిని సోఫాపైకూర్చుండియుంటిని ౯-౩౦ గం లకు ఒకచప్పుడు, వెంటనే మంటకనబడినది నేను ఫైరుబ్రిగేడుకొరకు టెలిఫోనివ్వబోతిని ఆగిరాగా బాక్సుక్రింద పొగకనబడెను. అక్కడొకచప్పుడు వినవచ్చెను. బాల్కనిగూడా అంటుకొనెను. నావారు స్త్రీలను దింపుటకు ప్రయత్నించుచుండిరి. వెలుఅప్పుతో కట్టబడి నకప్పునకు జ్వాలలుపోయెను. నిచ్చెనలవరకు వచ్చిన స్త్రీలు దింపబడిరి. నేనాపరేటరును చూచితినికాని ఎవరు నిప్పుచల్లార్పుమిషను వాడిరో జ్ఞాపకము లేదు. అప్పుడు ౭౦ రక్షకభటులుండిరి వారిని చుట్టునుంచితిని. అందువల్ల దొంగతనాలు జరుగలేదు. ఫైరుబ్రిగేడు ౧౦ గం ౧౫ లకు తనపనిని మొదలిడెను అప్పటికిజనులప్రాణములు రక్షించుటకాలముగడచియుండెను. ఇంకాకొందరునిప్పుచల్లార్ప ప్రయత్నించుచుండిరి ఫైరుబ్రిగేడు వారుకొనిమశిన్వారుకొని పైకి పోలేదు. మిస్టర్ మూఫీ ఫైరు ద్యోగులకు అది ఇదిఅని చెప్పుచుండెను."

### ఫైరుమాస్టరగు నాయుడుగారి వాఙ్మూలము

ఫైరుమాస్టర్ నాయుడు గారిట్లు చెప్పిరి:-

"నేను ఇగ్లాండులో ౯ ఏండ్లుండి, ఎలెక్ట్రికల్ మెకానికల్ ఇంజనీరింగుచదివితిని ౭౪ ఏండ్లనుండి హైద్రాబాదు ఫైరుబ్రిగేడు నాయధీనమునయున్నది. ఎన్నోఅగ్నిప్రమాదములలో, చార్మినారువంటిచిది నిప్పంటుకొన్నపుడుగూడా చల్లార్పియుంటిని. నేనారోజు పెండ్లాముపిల్లలతోసహా ఆటచూడవచ్చితిని. నావెనకభాగమున మెరుగుద్దుకనబడినవి చప్పుడువచ్చినది నేనునిప్పుచల్లార్పు మిషలునవాడితిని, కాని అదినాశక్తినిమించిపోయెను. అంత స్త్రీలకడకుపోయి ౧౦ ౧౨ గురిని బయటికి తీసితిని, ఫైరుబ్రిగేడువచ్చినసంగతి నాకు తెలుపబడలేదు."

### అసిస్టెంటు ఆపరేటరు వాఙ్మూలము

అసిస్టెంటు ఆపరేటరు ఈక్రిందివిధముగ వాఙ్మూలమిచ్చెను:- "నేను ౧౫ నెలలనుండి పనిచేయుచున్నాను. ఆనాటిమిషను నడిపి అలసియుంటిని. ఆపరేటరు "పెలుతురు" అనుమాటలువిని. క్రిందకిజూచి, నిప్పంటుకొనుటను జనులలో గలబడినిజూచితిని మిషను ఆపబడెను. నిప్పుచల్లార్పుమిషనుతో ఆపరేటరు యత్నించెను. నేనుకేబిన్ నుండి గ్యాలరీకుపోతిని. పొగవల్ల నాకు దెబ్బతగిలెను. మా మనుసులలోనికి దూకిని దెబ్బగూడాతాకినది."

### పోలీసుఅమీను సాక్ష్యము

తర్వాత ఒక్కయువ్యాలనివాసియగు ప్రేక్షకుడువాఙ్మూలమిచ్చినతర్వాత పోలీసుఅమీనుగారిట్లు వాఙ్మూలమిచ్చిరి. "సదరమీనుగారు పనిపడి నన్నుపిలిచిరి ౭-౧౦ ఆగాలువారిని వెళ్లుమని చెప్పితిని మేనేజరుకార్యాలయముపై స్త్రీలాగియుండిరి వెనుకనిచ్చెనసహాయమున నేనువారిని దింపి, పైకిపోయి అక్కడివారినిగూడాదింపినని పొగలోకివచ్చేంతకు మంటలెక్కువయ్యెను. కొనవరండామీదినుండి ఎక్కిపోతిని. స్త్రీలబుర్ఖీలనుడంచి బయటికితేబడిరి.

తర్వాత ఒక ప్రేక్షకుని ఫిల్ముఏజన్సీ ప్రతినిధి, హోటలుద్యోగి వాఙ్మూలములు తీసికొనబడెను.

## ౩ వరోజు విచారణ

హైద్రా: ౧౫ అమర్దాదు

౧౯ అమర్దాదునాడు శుక్రవారము అగుటచే కమిషనువిచారణ జరుపలేదు. మరల నేడు ఉదయము ప్రారంభించెను.

### యాకత్పూర పోలీసు సదరమీన్ సాక్ష్యము

యాకత్పూర పోలీసు సదరమీన్ అగు ఒబల్‌రెడ్డిగారు తమ వాఙ్మూలములో నీక్రింది విషయములను తెలిపిరి:— "నేను థియేటరు రాత్రి ౮ గంటలవేళవచ్చి ఫైరుమాస్టరు నాయుడుగారుగారి ప్రక్కనే ఒక సోఫాలో కూర్చుంటిని. సుమారు ౯౪ గంటలవేళ నాకు ఏదో ప్రేలినట్లు, పగిలినట్లు శబ్దము వినబడెను. వెంటనే నేను నావెనుక రాయల్ బాక్సులో గొప్పమంటలనుచూచితిని వినబడినశబ్దము "పటాకుల" శబ్దమువలెనుండెను. ధ్వని గ్యాలరీనుండిరాలేదు. కొందరు సినీమావారలు రాయలుబాక్సులో దీపముతో పనిచేయుచుండిరి. ఇరువురుపనిచేయుచుండిరి. నేను సోఫామీదినుండి ఎదుటనుండు కుర్చీకిదుమికి ౨వతరగతివారలద్వారముగుండా వెలుపడితిని. వచ్చినజనులందరు బెదరి వెలికిపరుగెత్తుచుండిరి. ఒక బాక్సులోనుంచి కొందరు స్త్రీలు సోఫాలపైకిదూకిరి. ఇద్దరుబిడ్డలు మిగిలియుండగా ఫైరుమాస్టరు వారలను సంరక్షించెను. నన్ను జనానాకుపోయి స్త్రీలసహాయపడగోరిరి. నేనుజనానాద్వారమువద్దకుపోయిచూడగా పొగ, మంటలు క్రమ్మియుండెను. కొందరుస్త్రీలను మెట్లమీదుగా క్రిందికికుంచిరి. మరికొందరిని నిచ్చెనమీదుగా క్రిందికిదించిరి. అనిచ్చెన కొంతసేపటికివిరిగెను. ఆటుపిమ్మట మరియొకనిచ్చెన ఉపయోగించబడలేదు. నేను అంతట పైనున్న స్త్రీలను క్రిందికి దూకవలసినదిగ చెప్పితిని. కొందరు అట్లేచేయగా, క్రిందనున్నకొందరు చేతులెత్తి పట్టుకొనిరి. కొందరుబిడ్డలుకూడ సంరక్షించబడిరి. థియేటరుఅంతయు మంటలతోను పొగతోను నిండియుండి, ఏదియు కనబడక అంధకారమయమైయుండెను. కొందరు స్త్రీలందరును రక్షించబడిరనిచెప్పిరి. ఇంతలో ఫైరుబ్రిగేడు వచ్చెను. నేను గాయపడితలతిరుగుచుండుటచే హాలునుండిలేచి యింటికిపోతిని. మదద్గారు కొత్వాలును, నేనును అక్కడయుంటిమి. నేను అదంతయుతిరుగుకొని జెనానాద్వారమువద్దకు పోవుటకు అయిదునిమిషములుపట్టును. బాల్కని

౮ వ పేజి చూడుడు

# భువనగిరి వార్తలు

## సోమేశ్వరాలయము

భువనగిరి. ౧౬-౧౧-౧౩౪౫,

ఈ గ్రామమున సోమేశ్వరాలయము అను ప్రాచీనదేవాలయము గలదు. దేవాలయమున కు స్థానికవర్తకుల సహాయము యేమాత్రము లేదు. పూజారిగారు అనేకసార్లు గోలకొండ పత్రికాముఖమున మనవిచేసుకున్నను యింతవ రకు యేలాటిసహాయము లభించలేదు. గంజు వర్తకులవద్ద "సోమేశ్వరధర్మము" అను పేటిక లు నామమాత్రమై యున్నవి. ఇదే గ్రామమున అంజనేయ అలయముగలదు. అంగ్ని అంగ్రేత రుల ధనసహాయముచే మార్వాడి అర్చకులు మార్వాడీల పరిపాలనలో యున్నది. అంద మైన పుష్పవనము విశాలమైన స్థలములు ఉన్నవి. స్థానికవర్తక సోదరులు శ్రద్ధవహించి దేవాలయమును పునరుద్ధరించదగుదురు.

## వైశ్య సంఘము

సుమారు మూడుమాసముల క్రితము వైశ్య సంఘము స్థాపించిరి. వైశ్యులచే ఎన్నుకొనబ డిన మహాశయులు ఈ క్రిందివారు.

౧. గా వెంకిట్టయ్య ౨. యిరువళ్ల లక్ష్మయ్య ౩. శీలాపాపయ్య ౪. బచ్చురామయ్య ౫. అ ల్లాడి నారాయణ పంచాయితిదారులు, వీరు ప్ర తి అమావాస్య తదితర సమయములందు సమా వేశమయ్యెదరు. జ్యేష్ట॥ ౩౦రోజున "కులాచా రధర్మము" గూర్చి రెండుఘంటలకు యుపన్య సించెదరు. అందరు హాజరుకావలసినదని ప్రక టించిరి, వీరిసమావేశము చూడవలయునని కు తూహలములతో నా అవసరకార్యము విడిచి సమావేశమునకై వేచియుంటిని, నాలుగు గం టలకు కొలదిమంది మాత్రమే వచ్చియుండిరి. అందులో యిరువురు పంచులు రాలేదని సభ ఆపివేయబడినట్లు ప్రకటించిరి. అమావాస్య విరామదినమైనను పంచులురాక సభికుల నాశా భంగమొనర్చిరి. ఇదే గ్రామమున ఒక సుప్రసిద్ధ వర్తకునిభార్య మహమ్మదీయునితో లేచిపోయి మరునాడు వచ్చినదని యేమూలచూచినా యి దే ప్రసంగము, పంచాయతిదారులు యేమి నిర్ణ యించెదరో? బహిష్కరించెదరో? చూడవల సి యున్నది.

## మేకపోతుపై మోటరు

అమావాస్యనాటి రాత్రి మేకపోతు ఒక ప్రధానదారివద్ద పరుండియున్న సమయమున దానిపైనుండి యెవరో మోటారు నడిపించి దాని ప్రాణముల దీసిరి. మోటారు సారథుల అమానుషకృత్యము లింకను బలముగా జరుగు చున్నవి.

---

# మూసాపేటవార్తలు

(విలేఖరి)

మహబూబునగరు; ౧౭-౯-౧౩౪౫ఫ:— మహబూబునగరు తాలూకాలోని మూసా పేటగ్రామము మహబూబునగర్ నుంచి ౧౪ మైళ్లదూరమున రోడ్డుసమీపమునఉన్నది. దీని సంఖ్య ౩౦౦౫ గృహసంఖ్య ౫౦౭ ఉన్న గ్రామములో బాటలు పరిశుభ్రముగా గన్న వి. మరియు లోకలుఫండునుంచి బాటలు సిద్ధమగుచున్నవి. బాటస సాఫర్ బంగులాఉన్నది. గ్రామ ఒక బాలుర పాఠశాలగలదు. ఇం బాలురు ౭గురుఉపాధ్యాయులు బాలికల రెండుపాఠశాల్ల కారిపాఠశా...




# రాయచూరు జలాశయ ప్రారంభోత్సవము

౧౭ అమర్దాదునాటిరాత్రి ౩ గం ౫౫ ని. లకు సెలూనులో నిజాంప్రభ్విగారు రాయ చూరువెళ్లిరి. వీరిసెలూను రాచప్లాటుఫారము పై ఆగెను. దానిముందొక సుదారము చుట్టు రక్షక, సైనికశాఖలవారి కాపలాయుండెను.

తెల్లవారకమునుపే. జనులుగుంపులు గా స్టేషను వైపు వచ్చుచుండిరి. రాజమార్గముల లో స్వారీలరాకపోకలు హెచ్చిపోయెను. పరి సరములనుండి రాజసందర్శనార్థమై యెండ్లు క చ్చరములపైవచ్చిన వారిభావములు (వారిలోనగా హిందువుల) మతములో గాఢకుగలస్థానము. మొదలగువవి వారుతమలో మాట్లాడుకొనుచుం డవిను వాంమేనులు పులుకరించుచుండెడివి ప్రా తమున ౭ గం లవరకు రాజకోటంపు, స్టేషను బ యటిప్రదేశము జనసమ్మర్దమై యుండెను. స్వ చ్ఛంద సేవకులు, రక్షకశాఖవారు, తమతమని యుక్తస్థలములందుండిరి రాజప్లాటుఫారముపై తెల్లనిగుడ్డలు పరువబడెను రంగురంగుల పతా కములుకట్టబడెను, గార్డుఆఫ్ఆనరు బ్యాండు, సిద్ధముగానుండెను.

### కృష్ణాలో ప్రభువుగారి స్పెషలు

౨-౫౦ గం. కు ప్రభువుగారి స్పెషలుకృష్ణా లో ఆగినదనియు ప్రాతఃకాల, ఉపాహారా నంతరము స్పెషలుముందుకు సాగునని యుం రాయచూరుమండలాధికారికి తంతివచ్చెను.

### ప్రభువుగారు రాయచూరులో

సర్. మహారాజా కిషన్‌ప్రసాదుబహదరు. మండలాధికారి. సుబేదారు, నాజులు, ఇత రఉద్యోగులు ప్లాటుఫారముపై స్పెషలుకై ఎ దురుచూచుచుండిరి. ౯ గం కు గంటకొట్టబడి. సిగ్నలుపడెను. జనుల కరతాళధ్వనులమధ్య ౯-౨౫ గంకు, స్పెషలుఆగెను. మహారాజ బహాదరు, మండలాధికారులతో ప్రభువుగారు మాట్లాడిరి. ౨౦ నిమిషలవరకు స్పెషలులో ఉండి, అక్కడినుండి, క్యాంపువరకు నడచి పోయిరి.

### జలాశయ ప్రారంభోత్సవము

క్యాంపులో తేనీరు పుచ్చుకొనినతర్వాత, రాయచూరు పురపాలకసంఘపక్షమున ప్రభు వుగారికి సన్మానపత్రమర్పింపబడెను. అందుకు ప్రత్యుత్తరమిచ్చుచు, ప్రభువుగారు ములతో స్వచ్ఛమైత్రిప్పగా, ముం హాలోనివుటలేచెను.

తర్వాత, అచారముగాదొ... గరము వెళ్లి విశేషముల తెల్యక విచ్చిరి.

### నజరానా

తర్వాత. నజరానా దలు సర్ మహారాజ రానా సమర్పించిరి. గూడా సమర్పిం...

మహాఘు... పరీక్షా... జంగు... ప్రభు... ఏ...

...షుల ౩౯ వేల ౭ వందల ౫౩, రూ ౧౩ అణా ల ౯ పాయిలు.

ఈ ౨౫ ఏండ్ల అభివృద్ధి ఇంతింతనిచెప్పలే ము విద్య, వైద్యము, వ్యవసాయము మొదలగు శాఖల వ్యయములుముందేముండెను, ఇప్పుడే మైనవి!

ప్రజాహిత కార్యము లందెంతవ్యయపరుప బడెను?

మచ్చునకు మీదటిమూండేం అంకె లనుంచెదము. రూ ౫౧౦౫౭౫-౨-౯ లు భూమిపన్ను మాఫీఇవ్వబడెను. రూ ౫౭౩౦౪ ౭-౧-౯ లు బరాయింపాచేయబడెను. రూ ౯౬౧౦౦౦ సంరక్షణకార్యములు, చేయబడె ను రూ ౫౪౬౨౪౫ ల తకావిఇయ్యబడెను. ప్రభువుగారి అనుగ్రహమువల్లనేగదా రాయ చూరుకాలమానఇబ్బందుల బారినుండిదప్పు మవచ్చెను.

మీసహాయముల) వన్నింటిని ఎట్లు వర్ణించత రము రైతులుసంతోషస్వాంతులైయున్నారు. ఒకప్పుడెందుకు పనికిరానిదినేడు తియ్యనినీరి చ్చు మండలమైనది.

ప్రభూ!

౧౩౩౯ హి॥జిలో రాయచూరు, ఇందూరు, ఔరంగాబాద. వరంగల్లుదయచేసి, ౨- షా బాన్ ౧౩౩౯ నాటి ఫర్మానుద్వారా, "నా ప్రియరైతుల సౌకర్యార్థము ముఖ్యముగా త్రా గుటకు మంచినీరుఅందచేయు వ్యవస్థకై స్థిర వ్యవస్థఅత్యవసరము"

అను ఫర్మానునిచ్చియుండిరి. దాని ననుస రించి ఔరంగాబాదుజిల్లా రాయచూరు, లా తూరులలో మురికికాలువలు, నీటివ్యవస్థ జరుప బడెను. అందుకు వ్యయములు క్రమముగా రూ ౬౪౬౦౦౦, రూ౧౧౩౫౦౦౦.రూ౧౨౭౫౦౦౦ రూ ౯౪౫౦౦౦,లైనవి.ఇదిగాకరూ౭.౨.౨౫౦౦ వ్యయముతో నాందేడులో మురికికాలువలు, నీ టివసతి, వ్యవస్థ త్వరలో పూర్తికానున్నది. అది గాక, ఈమండలములో నీరులేనికఠినప్రదేశము లందు మంచి నీటిబావులత్రవ్వించుటకొక ప్ర త్యేకశాఖ నేర్పరుచబడెను. ఆశాఖ ౧౦ ఏండ్ల లో ౧౨... ౨౦౬౭౩౬౯ ల వ్యయ... రక్ష... టి... వు... ఇట్లు గ్రామముల మండల కేంద్రపు నీ ...పబడెను. ఇపుడు ...యముపై ౧౧ లక్షలు ...పరచుటలో నవీనప ...ములకు,అఖిలభారతము ...ంచినందులకు రాయ ...ంచినను తక్కువయే. ...నుండి నీరుతేబడినది ...యమునకేని వేనకంజ ...తహతహపడు నీరా ఇంటేంటశుభ్రపరచిన ...లకు. మాన్విలోగూడ ...నగట్టిన నీరందజేయు ...స్కీముతోబాటు ౧ ...తో ...డినేటిగూడా ...భివృద్ధికై ౩౫ వేలవ్య ...ములకుముందు ఒయి ...లో నేడు పచ్చికబయ ...మురికికాలువలవల్ల మలే ...వ్యాధి ఇతరవ్యాధులు

...విన్న వేడుకొనుట. మ ...గడుట. విద్యుచ్ఛక్తి ... విమానాశయసమస్య ...ద ప్రాజెక్టుఅయితీరును ...తెవకై ౩ లక్షల ౫౦ ...దని తెలియుచున్నది. ...నకు రాకపోకలు రాజ్య నష్టము లేదు.

మంతట జర్ఘగును

ఇట్లు భవచ్చరణమహిమవల్ల రాయచూరు ... దు నాగరికనగరములలో తావు చేసికొన్నది.

రాయచూరువాసులపక్షమున పురపాలక సంఘము ఈసన్మానపత్రము సమర్పించుకొను చున్నది సదా ప్రభుత్వమునకు, రాజునకు, రాజ కుటుంబమునకు క్షేమలాభములకై వేడుచుం దుము మావచ్చెసంతల ఈనీరు తాగి, రాజ్యసౌ భాగ్యమునకు ప్రార్థనలు సల్పుదుము

ఇట్లు

ప్రభువుగారి దాసులము,

రాయచూరు పురపాలకసంఘసభ్యులము

---

### ప్రభువుగారి ఉపన్యాసము

ప్రియులైన రాయచూరుప్రజలారా

ఇంతకుముందుగూడా రాయచూరు వచ్చి యుంటిని కాని ఇప్పుడు నాకమితానందము కలుగుచున్నది ఏలన, ఇంతవరకున్న త్రాగు డునీరుఇబ్బంది యింతటితోపోయినది రాయ చూరుమండలములోని నీరుదొరకని కఠినప్రదే శములందు బావులుగూడా త్రవ్వింపబడినవి కాన ఈజిల్లావాసులకు మంచినీటివిషయము లోగల కష్టములుబాసినవి

"పురపాలకసంఘము, ప్రకటించిన ప్రజల భక్తిని మెచ్చుకొనుచు, భావములు సత్యములని నమ్ముచున్నాను

"శీతోష్ణస్థితుల లోపములచే రాయచూరు అధికముగ బాధపడునదికనుక చిన్న అవసరము లపుగూడాగట్టి సహాయములుచేయబడినవి

### ప్రియులైన ప్రజలారా

ప్రభుత్వపక్షమున మీకందజేయబడు సౌక ర్యములు మీకు లాభము కలుగచేయవచ్చును కాని మీరుగూడా మీ బాగోగులకై పాటుప డుటకు మరువకుడు

వ్యవసాయ, వాణిజ్యములలో వృద్ధినందుడు కష్టపడుడు మితవ్యయమున కలవడుడు అప్పు అమితవ్యయము మరచిపోండు మీకు పారమి చ్చుటకు వ్యవసాయ, వ్యాపార, పరిశ్రమ,సహ కార మొదలగు శాఖలున్నవి వీటినుండి లా భముపొందుడు

"గ్రామోద్ధరణయన్న నాకెంతో ప్రజనుల జీవితమునందిన మభివృద్ధి నాకెంతో ప్రేమ తుదకు సంతోష గా జలకోశపు ప్రారంభోత్సవము "సిల్వరుజూబిలీ వాటరు వర్క్సు" ... దుచున్నాను

---

# బండపై క్రొత్తగా దేవత

స్వ వి

మూడేపల్లి ౧౩-౯-౪౫,

ఇచట బ్రాహ్మణపల్లకు అవేశముకుదిరి చాల ప్రతాపములాడుచున్నది డాక్టరు రెడ్డిగారు మానసికవ్యాధియనిరి దైవజ్ఞ మాంత్రిక శిరో మణి వు బి యర్ మూర్తి శర్మగారుపసం హారమునకు సంప్రోక్షించిరి ఈగ్రామము బం డపై క్రొత్తగా రాజేశ్వరుడు చేరినట్లు వాడుక పరిజనము మొక్కులు చెల్లించుటకై వచ్చు చున్నారు

---

# కలరా విజృంభణ

వేములవాడ ౧౪-౯-౪౫

కలరా

రెండువారములనుండి ఇచట కలరా నిమ్మ ళించినట్లుండి ౧౧-౯-౪౫ తేదిన యిద్దరికితగి లి ఆరోగ్యతగాంచిరి ౧౨వతారీఖున ముగ్గు రికితగిలి ఒకడుచచ్చెను ౧౩వతారీఖున ౪గురి కితగిలి ఒకడుచచ్చెను ౧౪వ తారీఖు అనగా నేడు (౧౦) గంటలలో మరిఇద్దరికితగిలి వారు ఇపుడిప్పుడే ఆరోగ్యత గాంచుచున్నారు.

### వర్షములు

మొన్నటివరకు వర్షములులేవు. మిడుతలవలని చేలు చాలనష్టమైనవి. కాని ఈ ౩దినములనుం డి తుషారము ప్రారంభమగుటచే, చేలకంతగా నష్టము లేదు.

# ఇంపీరియల్ బ్యాంకులో ప్రామిసరీనోట్ల చెల్లుబడి

వైస్రాయిగారి అనుమతి

ఇంపీరియలుబ్యాంకుఆఫ్ఇండియా ఆక్టు ౧ భాగం ౧. ౧౯౩౪ వ మార్చి నిబంధన ప్రకారము, ఈవిధముగా మార్చబడినది.

సంస్థానాధీశ్వరుల అధికారమున వెలువడిన డిబెంచర్లు, ప్రామిసరీనోట్లపై అప్పులిచ్చుటకును రొక్క-పుఖాతాలు వెలువరచుటకును అధికారమివ్వబడినది. నిజాం ప్రభుత్వపు అప్పులన్నియు ప్రభువుగారి ఆజ్ఞపై నివ్వబడినవి.

ఈఅప్పులన్ని తీర్చుటకు ఒక "సింకింగ్ ఫండు" ఏర్పాటుచేయబడినది. నియమితకాలముపై అప్పుచెల్లించుటకు సరిపోవునంతటి ధనమందు చేర్పబడును.

కావున హైదరాబాదురాజ్యపు ప్రామిసరి నోట్లు, ఇంపీరియలుబ్యాంకు అఫ్ ఇండియా ఆక్టుప్రకారము ఒప్పుకొనబడువిషయమున గవర్నర్ జనరల్ (రాజప్రతినిధి) ఇన్ కౌన్సిలు మంజూరి యివ్వనయినది.

ఇక పై వ్యవస్థానుసారం ఇండియా ప్రభుత్వపు ప్రామిసరి నోట్లపై ఇచ్చినటులనే హైద్రాబాదరాజ్యపు ప్రామిసరినోట్లపైకూడ ఇంపీర్యలుబ్యాంకుఆఫుఇండియా అప్పులిచ్చుచుండగలదు.

— మాలూమా తెలియమా

## ప్రభువుగారికై విశేష ఏర్పాట్లు

దేవస్నూరు, పెండాలు ద్వారములు సిద్ధమైనవి. రాయచూరులో ఉత్తర దక్షిణ దిశలకు రెండుద్వారములు నిర్మింపబడి ఇంగ్లీషులో "స్వాగతము" అని వ్రాయబడినది.

...గుడారములకు పట్టుతెరలు కట్టబడెను ...ను రాత్రింబవళ్లు పనిచేసిరి. పెండా...పు ఒకగుడారముచుట్టు మొర...త్కాలికముగా పచ్చిక, పూల...డుచున్నవి.

...ఈలలిప్పవు, షంటింగుకుకూడా ఏర్పరుపబడెను.

...వసపైనచ్చిన రక్షకశాఖవారికిగుడారము ప్రత్యేకింపబడినవి

ఒకప్రత్యేక తపాలాఫీసుగూడా నెలకొల్పబడెను. దేవస్నూరు జలాశయముకడ ప్లాటుఫారములు వేయబడెను. పచ్చిక వేయబడెను. రైల్వేహద్దులలో ప్రత్యేకస్థలము తడకలచే చుట్టబడినది,

## ఉద్యోగవిషయములు

ప్రభువుగారి ఫర్మానుద్వారా, మిస్టర్ అబ్దుల్ఖాదరు బి. యస్సి. ఆనర్సు [అర్థశాస్త్రము] లండను, ఉస్మానియావిశ్వవిద్యాలయకళాశాల అర్థశాస్త్ర లెక్చరారుగా, నియమింపబడిరి.

# పారిపోయిన పిల్లవాడు

సుబ్బారావు (ఇంటిపేరు నూమిడేల) అను ౧౪ ఏండ్ల బాలుడు పోయిన శనివారము మధ్యాహ్నము బడికి పోయియుండి అదిమొదలు కనపడలేదు. అతడు పసిమిచాయగా నుండును. బడికిపోవునపుడు తెల్ల లాగు, ఒక చొక్కా, ఒకకోటు ధరించి యుండెను. అతనికి ఎడమచెవుమీద ఎడమ భాగముపై సుమారు రూ౧ విలువగలదిఉండును. ఈ హైద్రాబాదు (దక్కను) నగరములో అతడు ఇస్లామియా హైస్కూలులో చదువుచుండెను. అతడు సుమారు ౫అడుగుల ఎత్తుండును. పోవునపుడు దగ్గఱ ఏడణాలుమాత్రము ఉండెను. అతనిని కనుగొన్నవారలు ఈ పత్రికద్వారా తెలియచేయ ప్రార్థన.

## క్రొత్త బిరుదులు

చక్రవర్తిగారి జన్మదినోత్సవ సందర్భమున, క్రిందివారలకు బిరుదములొసంగబడెను.

ఓ. బి. ఇ- (ఆర్డర్ ఆఫ్ది బ్రిటిష్ఎంపైరు.) ఆర్షశాఖ నాజంగారసు గులాందస్తగీరు యజ్దానిగారికి-

ఖాన్సాహేబు - మౌల్వి అరిప్సాహెబు ఇంజనీరు (ప్రభుత్వ విద్యుచ్ఛక్తిశాఖ)

రావుసాహెబు- మిస్టర్ జి. ఏ. పద్మనాభస్వామి సికింద్రాబాద వర్తకులు.

# బజారు ధరలు

## దడువైరామన్నగారు

(హైద్రాబాదు ఉస్మానుగంజు)

౧౯-౯-౧౩౪౬ఫ. బుధవారము

| | | | |
|---|---|---|---|
| | | పల్లా 1కి | రు. అ. ప |
| బన్సి గోధుమలు | | ,, | ౧౪-౧౫ |
| గోధుమలు జెలాల్య మొ॥ | | ,, | ౧౪-౧౪౹ |
| బియ్యముదొడ్డువి క్రొ॥ మొ॥ | | ,, | ౧౨౹-౧౩ |
| ,, నానకరాంలు క్రొత్తవి | | ,, | ౧౩-౧౩౨ |
| ,, నానకరాంలు పాతవి | | ,, | ౧౬-౧౭ |
| ,, కాశిపిచోడీలు | | ,, | ౧౭౹-౧౮ |
| ,, క్రిచిసాంబారులు క్రొత్తవి | | ,, | ౧౬।-౧౬।౨ |
| ,, రామసాగరాలుక్రొత్తవి | | ,, | ౧౪।-౧౪౹ |
| ,, డిటో | పా॥ | ,, | ౧౫-౧౫। |
| ,, పిచోడీలు | | ,, | ౨౫-౩౦ |
| ,, అమర్ సర్ సన్న బియ్యం | | ,, | ౩౫-౪౦ |
| ,, మోతిచూరు బియ్యం | | ,, | ౩౫-౩౬ |
| కందులు | పెద్దవి | ,, | ౯-౯। |
| కందిపప్పు | పెద్దది | ,, | ౧౩-౧౪ |
| పచ్చపెసలు | | ,, | ౧౦- |
| పెసరపప్పు | | ,, | ౧౫-౧౫౺ |
| నల్లపెసలు | | ,, | ౮-౮। |
| మినుములు | | ,, | ౯-౯౹ |
| మినప పప్పు | | ,, | ౧౫-౧౫। |
| ఉలవలు | | ,, | ౭-౭। |
| జొన్నలు | | ,, | ౯-౧౦ |
| శిరి సెనగలు | | ,, | ౧౨౹-౧౨౺ |
| సెనగలు | క్రొత్తవి | ,, | ౧౧-౧౧౺౨ |
| పుప్పు | | ,, | ౧౨।-౧౨౹ |
| తవుడు | | ,, | ౩-౩౹ |
| పత్తిగింజలు | | ,, | ౭-౭౹ |
| అలచందలు | | ,, | ౯-౯। |
| ఆనుములు | | ,, | ౭-౭౹ |
| బటానాలు | | ,, | ౮-౮౹ |
| తెల్లనువ్వులు | | ,, | ౨౪-౨౫ |
| బెల్లము | | ,, | ౧౦-౧౦౹ |
| ఎఱ్ఱ చక్కెర | | ,, | ౧౪-౧౫ |
| తెల్ల చక్కెర | | ,, | ౧౨౹-౧౨౺ |
| వేరుసెనగ | చిన్నవి | ,, | ౧౮౹-౧౯ |
| పసుపు | | ,, | ౧౨-౧౩ |
| మిరప కాయలు | | ,, | ౧౫-౨౦ |
| చింతపండు క్రొ॥ మొ॥ | | ,, | ౨౦-౨౧ |
| అల్లం | 12సేర్లకు | మొదలు | ౩౺౨-౪ |
| నెయ్యి | 40 | సేర్లకు | ౪౨-౪౩ |
| ఫుల్లిగడ్డ | | పల్లా 1కి | ౫।-౫౹ |
| యెల్లిగడ్డ | | ,, | ౨౺- |
| వేరుసెనగనూనె | 12 | సే॥ | ౪-౪।౨ |
| చింతపండు పాతది | | | ౧౦-౧౩౹ |
| గడ్డినువ్వులు | | | ౧౪-౧౫ |
| తైదలు | | పల్లా ౧ కి | ౭-౭౹ |
| లంకలు | | | ౯।-౯౹ |
| లంకపప్పు | | | ౧౩-౧౪ |
| లంకపిండి | | | ౧౧౺- |
| ధనియాలు | | మ౧కి శే౧౬ | ౨౺౨-౨౺ |
| మెంతులు | మం॥ | | ౨।-౨౹ |
| సోంపు | | శే॥ ౪౦ | ౧౦-౧౦। |
| ఆముదాలు | | | ౧౪౹-౧౪౺ |
| కొర్రలు తెల్లవి | | ,, | ౯-౧౦ |
| కుసుమలు | | | ౧౦।- |
| సోమ | | ,, | ౧।౨-౧౹ |
| ఆవాలు | | ,, | ౨।-౨౨ |
| వెండి | ౧౦౦ | తు॥ | ౫౮౺-౫౯ |
| బంగారము | | తు ౧కి | ౪౧-౪౧౺ |
| సవరను | | ,, | ౨౬౹౨ |

# గోలకొండ పత్రిక

ధాత నామ సం॥ ఆషాఢ శు॥౬

గురువారము




## యువకుల సంఘటనము

గత సంచికలో బాల వివాహములను జరుగకుండచేయుటకు మన ప్రస్తుత పరిస్థితులలో యువకుల సంఘటనకంటె ఎక్కువఅనువగు మార్గము లేదని చెప్పి యుంటిమి. అదియెట్లో కొద్దిగ నిరూపించి కూడ ఉంటిమి. ఇప్పుడు మా వాదమును నచ్చచెప్పుటకై మరికొంత విస్తరించి చెప్పదలచినాము. ఈవిచారణ యంతయు ముఖ్యముగా, బాలవివాహములను నాచరించు వారలనుగూర్చి యనుమాటమాత్రము జ్ఞాపకముంచుకొనవలెను.

వివాహములు స్త్రీలకంటె పురుషులకు ఎక్కువవయస్సులో జరుగుచున్నవి. సాధారణముగ పురుషులకు వివాహములు ౧౮ వ యేడు దాటినతర్వాత గానిజరుగుచుండుటలేదు. అంతకంటె తక్కువవయస్సుగల పురుషులకును జరిగిన వివాహములుగలవుకాని అవి అసాధారణములు, అరుదు. స్త్రీలకు తొమ్మిది పదియేండ్లకు వివాహములు జరుగుచుండుట సాధారణము. ౧౧ ఏండ్లకు అంతకంటెయెక్కువవయస్సులో కూడ ఇటీవల వివాహములు అధికముగనే జరుగుచున్నవిగాని, అప్పటికిని మొదటితరగతివే చాల ఎక్కువగా నున్నవి.

పురుషునికి సాధారణముగా వివాహము జరుగువయస్సువచ్చువరకు, అతనికి లోకజ్ఞానము కొంత అలవడియుండుటయేగాక, అతనికి స్వతంత్రబుద్ధి యనునదికూడఏర్పడియుండును. అనేక విషయములందు తల్లి దండ్రులకును, ఇతర బంధువులకును, అతని వేషభాషలను ఆచారములను ప్రతి విషయమందును తాము నియమించినట్లోననే నడిపించుట దుష్కరముగుచుండును. ఇది కౌమారదశ పరిపాకమును పొందుచు యౌవనదశవచ్చుకొలది ఏర్పడుచుండు స్వతంత్రబుద్ధియొక్క లక్షణమే. స్వతంత్రబుద్ధి ప్రేరితులై పలుసందర్భములందు పురుషులు తల్లితండ్రుల నిబంధనలను ధిక్కరించుటయు అనేక సందర్భములందు జరుగుచుండును. అందులోముఖ్యముగా, రాజ నాగరికత యైప్రపంచమునందు అధికభాగమునుజయించిన 'నవీననాగరికత' యనబడునది అధికముగ జనులను ఆకర్షించుచున్న కాలములో, సనాతనసంప్రదాయములపై గౌరవముగల స్వదేశీయ ప్రబుద్ధులు కూడ ధర్మవిరుద్ధములుకావని తలంచు ఆచారములవిషయములో, తల్లిదండ్రుల మూఢసనాతన నిబంధనలను ధిక్కరించుటకు ఇంకను ఉత్సాహమెక్కువ. కాని స్త్రీలకు వివాహవయస్సు వచ్చునప్పటికి సాధారణముగా అట్టిస్వతంత్రబుద్ధి వారికేర్పడియుండదు. అనగా వారి బుద్ధి పోషకులగుతల్లిదండ్రుల అధికారమునకు లొంగియుండును. పురుషులకంటె స్త్రీలకు సహజముగా ఎక్కువగా నుండు సిగ్గుకుకూడ వారిస్వాతంత్రబుద్ధిపై అధికారమే. కావున వివాహము మాట వచ్చినపుడు ఇష్టముకాని వివాహమును తల్లిదండ్రులమాటను ధిక్కరించి నిరాకరించుటకు పురుషులకున్నంత ధైర్యము స్త్రీలకుండదు. కనుక బాల్యవివాహ నిషేధమునకై బాలికలలోకంటె బాలురలో ప్రచారమే శీఘ్రఫలదాయకము.

అదియుగాక, ప్రచారముచేసి సంఘటన చేయుదమనిన, బాలురయంతసులభముగాబాలికలులభించరు. బాల్యదశను దాటినస్త్రీలను చదువుకై బళ్లకు పంపు ఆచారముఅరుదు. సంస్కర్తలు బాల వివాహములకు ప్రతికూలముగ ప్రచారమును బాల్యదశదాటినవారలలో ఇండ్లవెలుపలచేయగలరేగాని మరొక వయసులో మరొకసందర్భములోచేయుటకష్టము. బాల్యదశను దాటినస్త్రీలు బాల్యదశదాటినపురుషులవలె ఇండ్లవెలుపల అందుబాటులోనుండరుకాన యువతీసంఘటనకన్న యువకులసంఘటనయే అనువైన మార్గము. బాల్యదశలో వివాహమునుగూర్చిన సంగతులను బోధించజాలము, బోధించుటయు మంచిదిగాదు. అంతేగాక బాల్యదశను దాటిన స్త్రీకి సాధారణముగ వివాహమైయుండును.

బాలవివాహములనాపుటకై చేయు సంఘటనము స్త్రీలలోకంటె పురుషులలోనే ఎక్కువఅనుగుణమౌటకు ఇంకొక కారణము మనస్త్రీలకుసాధారణముగ లేని ఆర్థికస్వాతంత్ర్యము పురుషులకుండుటయే. వివాహవయస్సువచ్చునప్పటికి పురుషుడు స్వతంత్రముగ జీవించగలవాడు అగుచున్నాడు. యుక్తవయస్సు రాని బాలికను వివాహమాడనని యువకుడైనను తల్లిదండ్రులను ధిక్కరించినపుడు తల్లిదండ్రులు కూడుపెట్టమని బెదరించినను పురుషుడు భయపడక ఏదోయొకవృత్తిని వెదకుకొనవచ్చును. స్త్రీలలో బాల్యదశ దాటిన తర్వాత విద్యనిచ్చు ఆచారములేనందున, వారలు అట్లుచేయజాలరుగదా!

అథవా అనుకూలమేమన, బాలవివాహములకు అంగీకరించకుండుటలో తల్లిదండ్రులకు వ్యతిరేకించుటఅధర్మము కాదు. కాబట్టి, దురాచారములకులోనైన పుత్రులనే ప్రేమవల్ల ఏమనలేనప్పుడు, అధర్మముకాక, ధర్మమైన దానికై పట్టుబట్టిన పుత్రులను తల్లిదండ్రులు ఏమనుటకుగాని నైతికబలము ఉండజాలదు. కనుక తల్లిదండ్రులకు నష్టము కలిగించుట ఏమియు ఉండదు: వివాహమును వరుడు ఒప్పుకున్నను అది జరుగజాలదు. పురుషుడు ఒప్పనప్పుడు అట్టివానికి అయిష్టముకాని కన్య నిచ్చుటకు తల్లిదండ్రులే ముందుగా భయపడుదురుగదా!

ఈవిధముగ కౌమారదశదాటుచున్న పురుషులు ఎట్లు బాలవివాహప్రతికూలమైన సంఘటనకు అనువో నిరూపించబడినది. అట్టికౌమారాంత వయస్కులగు పురుషులను సంఘటన జేసినచో, బాలవివాహములును జరుగకుండపోరాడుటయందు వారలు ఒక్కటీముగాచేయబడిన ఆటగాండ్రవలెను, దళములుగా శిక్షితులైన సైనికులవలెను, మహోత్సాహముతో తప్పకజయముసాధించగలరు.

---

## మోతీమహల్ దురంతముల విచారణ

ఐదవ పేజీ తరువాయి

చాలమంది గుంపులను చూచి తిరిగివచ్చితిని. తర్వాత రెండవతరగతికిపోగా అక్కడ స్త్రీలు క్రిందదూకిరని చెప్పిరి. పిమ్మట ఇంటికిపోతిని. మొదట తిరిగివచ్చినపుడు గ్యాలరీపైనగాని కేబినులోగాని నిప్పురవలేమియు చూడలేదు. తిరిగివచ్చి హాలులోకి వెనుకనుండి చూడగా స్త్రీలను ఎవరో క్రిందికిదించియుండిరి. హాలులోకి ఒకనిచ్చెన తీసికొని పోబడుచుండుట చూచితిని. నిచ్చెనతీసికొని పోవుచున్న వారలలో పోలీసులనెవరిని చూడలేదు. వారలు సినీమావారలైయుందురని నా అభిప్రాయము,"

### లేడీ డోరుకీపరు వాఙ్మూలము

మేరీ సామ్యుఅల్ సప్రమాణముగా వాఙ్మూలమిచ్చుచు, నీక్రిందివిషయముల తెలిపెను.

నేను ౪ ఏండ్లనుండి లేడీ డోరుకీపరుగా నున్నాను. తెంతెలక్రింద కూర్చొనియుంటిని. అంతలో పిల్లవాడు పడినచప్పుడు వినవచ్చి లోపలికిపోతిని. అచట, మంట-జ్వాలలు చూచితిని. బాల్కానిమూల గూడ తగులబడుట జూచి, "ఆడవాళ్లు దిగండి" అని కేకలిడి. క్రిందపడి మూర్ఛిల్లితిని. మగవారు స్త్రీల వైపు వచ్చునపుడు నేనచటనేయుంటిని. నా అణాల వి ౩౦. రూపాయవి ౧౦-౧౩, రజత్వవి ౫౬టి కట్లు నాచేతికి వచ్చినవి.

### డోరుకీపరు వాఙ్మూలము

డోరుకీపరు కేసర్ సింగు సప్రమాణముగా ఇట్లు వాఙ్మూలమిచ్చెను.—నేను అల్లరిజరిగినపుడు ద్వారముపైనుంటిని. అది ౯౹౪౫. సమయము. నేను చప్పుడువినలేదు. మేనేజరుఆజ్ఞపై స్త్రీలద్వారమువైపు పోతిని. ఫైరుమాస్టరుగారి "నీరునీరు"అను అరపుపై నీరులేను పరుగెత్తితిని. హాలులో వెలుతురులేకుండెను. స్త్రీలవైపుపోగా నొకముదుసలి. "రక్షింపు"మని అరచుచు నన్నుపట్టుకొనెను. నాకు సోఫావి ౫౬టిక్కట్లు దొరికెను. బాక్సువి దొరకలేదు. బాక్సులో ప్రేక్షకు లెట్లుపోయినది నాకు తెలియదు. నేను స్త్రీల రక్షించు ప్రయత్నము చేయలేదు. బాక్సు నెవరుగాని శుభ్రపరచుట చూడలేదు.

మహమ్మదు అబ్దుల్ ఆలీం, ప్రేక్షకు నిసప్రమాణ వాఙ్మూలమిట్లుండెను.

నేను ఖానివిద్యార్థిని. ౧౦అ. దర్జాలోనుంటిని. ౯౹ గం.కు "కాలేజికన్య" ఆటలో హత్యాభియోగ విచారణజర్గుట, నాయికయగు మిస్ మదురి "హత్య-హత్య"యని కేకలిడుట—వెనకనుండి పటాకుచప్పుడువచ్చుట ఒకేసారి; వెనకతిరిగిచూడగా, కేబినులోనుండి వెలుతురువెల్లి తెరపైబడు, రంధ్రములనుండి జ్వాలలు కనబడెను. మీదినుండియె జ్వాలలు వచ్చుట-సోఫా-బాక్సు-లకు మీదినుండియె నిప్పంటుకొనెనని దృఢముగా చెప్పగలను. ఫిల్ములో తుపంచాలు ప్రేలినతర్వాత సభాదృశ్యమువచ్చెను. అప్పుడు ప్రేలినచప్పుడు వచ్చినది. అది ఫిల్ముతుపంచాలకన్న ఎక్కువచప్పుడు చేసినది. ఫిల్ముహాలులవెలుతురు ఆగినది. న్యాయస్థాన దృశ్యమపుడు హాలులో దీపములుండెను. నేను "రక్షించుడ"ను ధ్వనులవిని, స్త్రీలవైపుపోతిని. అట ౨-౩ సైనికులు స్త్రీల సహాయముజేయుచుండిరి. స్త్రీలు దుముకుచుండిరిగూడా, ఎవరినిగాని రక్షించు అవకాశము నాకు చిక్కలేదు. ఒకరు కాలుచున్న తంతెలనుండి ౫-౬ స్త్రీలను బ్రతికించిరి. తుదకతని ఓళ్లోఓశిశువుండెను. అతడుబడ్డుపాడుపుకలిగి, నాటువేసుకొని యుండెను. గడ్డములేదుగాని పెద్దమీసములుండెను.

నావెంట ౧౫-౨౦ మందివచ్చిరి ఎవరికినిమంటలో దూకుటకు ధైర్యములేకుండెను. ౧౦౹౪ వరకు హోటలుముందు నిలుచుంటిని. ౧-౨ పోలీసులగుపడిరి. ఓసాధారణవెడురు నిచ్చెన స్త్రీలబంగళాకు పెట్టియుండెను. కొందరు గాయపడినవారిని, ఆరిపోయిన కొందరు స్త్రీలనుచూచితిని. ఫైరుబ్రిగేడు కనపడలేదు. జనము, పోలీసు సహాయపడుచుండిరి. అపెత్తుమనిషి తన కాలికోపిల్లవాడు తాకనని స్త్రీల ఆర్తనాదము వచ్చుచున్నదని చెప్పెను. కాని నేను పోజాలకుంటిని.

---

### మ. ఘ. వ. ప్రభు॰ అభిప్రాయ॰

ప్రభువుగారు మోతీమహాలు గూర్చి సెలవిచ్చియుండిరి అం దునాటి రహబరులో ప్రకటింపబడ సందర్భమున నేనుకూడా కొంత చె. కొన్నాను మాననీయుల ఇంటిబిడ్డలు,కొం దాదాపు రోజు ఆటలజూచుటకై సందుగొందులలో (అది పర్దాలోనుండువారు) తిరుగుచుండుట, వారి నడవడినేగాక, పుట్టినింటికి, మెట్టినింటికి, గూడా కళంక మాపాదించువారగుదురు అట్టితరి, భారతదేశములో పెద్ద సంస్థానపు గృహిణులు చూస్తుచూస్తు ఇట్టి తగని ప్రవర్తనకు లోబడి లోకమున చులుకనైపోవుటతగదు వారు తమ హోదాకు తగిన నడవడి కలిగియుండుటతో బాటు ముందురాబోవు సంతతివారికి మార్గదర్శకులుగా నుండవలెను నిన్నటిఘోరము అబలలపై మాత్రమే! అదియు పెద్ద కుటుంబములవారిపై, జరిగినది. ఈగుణాపారము విచ్చుటకు తమను బలినిచ్చిన గృహిణులు పెద్దఘరానావారే!చివరకు తూర్పు ఎన్నటికిని తూర్పే. అది పశ్చిమ అలవాటుల అనుకరింపజాలదు

మంచివిషయములనుకరించుటశ్లాఘనీయమే కాని "మక్షికమక్షి" చేసిన ఫలితములు విరుద్ధములగును అందుకు నిదర్శనము నిన్నటిదురంతమే కాన ఇకముందు నగుబాట్లు కలుగు నడవడిని త్యజించి ఈదురంతమునుండి గుణపాఠము తీసకొనవలెను.

మంచి ప్రవర్తనకలిగి, విచారించి ముందంజవేసిన నగుబాటుగాని, వెనకతిరుగుటగాని అవసరముండదు ఈనా కొన్నివాక్యములు, కొందరు నాసోదరీమణులకు బిడ్డలకు రుచింపకుండవచ్చును గాని, చల్లని మనస్సుతో విచారించిన ఇది తమక్షేమమునుకోరకేయని గుర్తింతురు. "వస్తువు చేదైనను, గుణముతీపి" అని అన్నటుల.

# పేరుకై వృథావాగ్వాదములమానుడు

## ద్వితీయ మున్నూరుకాపు మహాసభ అధ్యక్షోపన్యాసము

సోదర సోదరీమణులారా!

తామందఱుకలిసి నన్నీమహాసభకు అధ్యక్షునిగా నెన్నుకొన్నందులకు కృతజ్ఞతావందనము లర్పించుచున్నాను. నాపై మోపబడిన యీ భారమును యందఱి సహకారములేనిదే నిర్వహింపజాలను. కావున తామందఱును నాకన్నివిధముల తోడ్పడి మహాసభాకార్యములను జయప్రదముగా నిర్వహింతురుగాకయని ప్రార్థించుచున్నాను.

సాంఘికోద్యమము ఆవసరము

ప్రపంచమంతయు యశోవిమానముపై నెక్కి యున్నతశిఖరములను దాటుచున్నది. ప్రతిజాతి బలవంతమును- తేజోవంతమును ధనవంతమునగుట కెన్నియోవిధముల ప్రయత్నించుచున్నది. తమ వ్యక్తిత్వమును నిలుపుకొనలేని జాతికి, తమ యాధిక్యమును, తాములేనికొఱత నితరులకు భాసింపజేయజాలని జాతి ఉండియు లేనిసమానమే! జాతియస్తిత్వము దృఢీకరించునది సంఖ్యాబలము మాత్రమేకాదు. బుద్ధిబలము, నుద్యోగబలము నత్యావశ్యకమై యున్నది. సుమారేబది సంవత్సరములకుపూర్వము పేరుప్రతిష్ఠలైనను లేని జపానుజాతి నేడు ప్రపంచములోని వ్యాపార కేంద్రములనన్నింటి నాక్రమించుకొనినది. యాంత్రికయుగమునందలి నేటి సంఘర్షణల కాగజాలుటకు స్వయం సహాయమును, పరస్పర సౌభ్రాతృత్వమును కావలసియున్నవి. అన్నివిధముల వెనుకకుద్రోయబడిన మన భారతదేశము నందాంధ్రులలోని యొకశాఖవారమగు మనమెంత నికృష్టస్థితియందుండియున్నామో, యాత్మగౌరవ సాధనములను విస్మృతి జెందియున్నామో వేఱుగా తెలుపనవసరములేదు. సంఘజీవనమున నూతనవికాసమును గలిగించుటకు, సంఘీయులలో నూతనభావోదయమును గలిగించుటకెంత మహోన్నతమైన కృషియైనను చేయవలసియున్నది. మన సంఘోన్నతితోబాటు ...ల సమిష్టివైభవమును రాష్ట్రీయుల ఔన్నత్యమును ప్రస్థాపించుభారము ...న్నది. అట్టిభారమును మోయవలెననిన మనమందఱము ఏయేపేర్ల ...హరింప బడుచున్నను—పరస్పర భేదములను మఱచిపోయి, వ్యర్థావా...ములతో కాలమును వ్యర్థపుచ్చక సత్వర పురోగాములమగుట కేకముఖ ప్రయత్నింప వలసియున్నది. ఇట్టి మహాసభలమూలమున మనమందఱ...మొక్కచోజేరి పరస్పరవిచార వినిమయముచేసికొని ఏకాదర్శులమై తదాదర్శ సంప్రాప్తికహోరాత్రములు కృషిసలుపవలసియున్నది. ఇట్టిఆదర్శ ఫలప్రాప్తికై మనముచేయు కృషియందు విఘ్నముల నాపాదించుటకెట్టి పరిహాసపాత్రములగు కార్యములనైన గొందరుజేయుచుండ వచ్చును. ఐనను మనమువానినిలక్ష్యముచేయక శాంతముతోను పూనికతోను మనకార్యములను నిర్వహింతము; రండు!

విద్య

సాంఘిక సర్వతోముఖాభివృద్ధికి సంఘీయులు తమ జవసత్త్వములను ...గ్రహింపవలసియున్నది. సాంఘికులలోని యాత్మవంచనను, స్వార్థపరత్వమును ...రూపుమాపుటకు గట్టి విద్యాప్రచార మావశ్యకమైయున్నది. విద్యలేనిది తమసత్త్వ...ములుగాని, బాధ్యతలుగాని బోధపడవు. స్త్రీపురుష వివక్షతలేక విద్యాప్రచారముగావించకుండిన కులస్థులలో ప్రబోధముకలుగజాలదు. కావున దేశములోని ...పల్లెమూలల నివసించుచుండిన మన బాలబాలికలవఱకు విద్యనువ్యాపింపజేవలెను. తమబాగోగులను తామేసవరించుకొనునట్లు చూచుట ప్రతికులస్థుని ప్రథమ విధియైయున్నది. ప్రభుత్వ కార్యాలయములలోనికి పనికివచ్చువిద్య మాత్రమే యొసంగినచాలదు. వృత్తివిద్యలు, చేతిపనులు, నూతనవ్యవసాయ సాధనములు, ఆర్థికవిధానమునందలి రహస్యములు, ఆత్మవికాసమున కవసరమగు కళలుకులస్థుల యందుబాటులోనుండు నట్లొనర్చుటకు ప్రయత్నింపవలయు. మనమందఱ మేకమైనచో చేయజాలని కార్యమేదియు లేదు. మనము కార్యక్రమాళికను సిద్ధపరచి అమలులోపెట్టుటకు ప్రతమూనితిమేని రాబోవు పాతికవత్సరములలో మనసంఘముకూడ దేశములోని యితరసంఘీయులతో నేమాత్రము దీసిపోకపోవుటయేకాక సర్వతోముఖాభివృద్ధికి రాగలుగుదుమని నాదృఢవిశ్వాసము.

స్త్రీవిద్య

...ల మూఢాచారములకు, మూఢవిశ్వాసములకు మూలాధారము స్త్రీ...యజ్ఞానము క్రొత్తదికాదు. అట్టియవిద్యామూర్తులు మనయింటింట ప్రతిదినము ప్రత్యక్షమగునంతవఱకు మనకు తరుణోపాయములేదు. కావున పురుషులుకూడ తరింపవలయుననిన ముందు స్త్రీలను విద్యావతులుగా నొనర్పవలెను. ఒకహిందీ కవీశ్వరుడు నచించినటులు స్త్రీలు సంస్కరింపబడనిది మనగృహములందు నివాసమేర్పఱచుకొనిన యవిద్యాంధకారము తొలగజాలదు. మూఢవిశ్వాసములు నశింపజాలవు. ఆత్మోన్నతి జరుగజాలదు.

విద్య—మాతృభాష

మనముగ్గుబాలతో నేర్చుకొనిన భాషలో దెలిసికొనునట్లు యెంతసులభమైనను ఇతరభాషయందు దెలిసికొనజాలము. కావున విద్యాసౌకర్యములు మన మాతృభాషలోనేగలుగుట వాంఛనీయము మాత్రమేకాక అన్నిటికన్న ముఖ్యమైనది కావున మనమందఱ మదేవిషయమును ప్రభుత్వమువారితో నివ్వవించుకొని మనకవసరమగు విద్యనంతయు మాతృభాషామూలముననే నేర్పించుటకు వేడవలయును. ఇట్లనుచుంటినని యితరభాషలను నేర్పగూడదనియే చెప్పుచున్నానని భ్రమింపకుడు. మనవైజ్ఞానిక వికాసమునకును, అవసరకార్య నిర్వహణమునకును తగినంత, అవసరమైన యన్యభాషా పఠనమునుగూడ నిరుపవగూడదు. విజ్ఞానమేభాషయందున్నను వాంఛనీయమే! కావున మాతృభాషకు ప్రథమస్థానమిడునట్టి సరియైన విద్యావిధానమును సంపాదించుటకు కృషిసలుపవలయును.

నిర్బంధప్రాథమికవిద్య

ఎంతమంచి పనియైన నూరకచెప్పిన చేయువారు తక్కువ. కావున ప్రజలలో విద్యాసక్తిని పెంపొందించు ప్రచారముతోబాటు ప్రభుత్వమువారును నిర్బంధ విద్యావిధానము నాచరణలోనుంచిననేగాని మనయుద్దేశ్యము పూర్తిగాసఫలము గాజాలదు. కావునకనీసము ప్రాథమికవిద్యనైనను శాసనమూలమున నిర్బంధించుటకు ప్రభుత్వమువారిని ప్రార్థింపవలెను. ప్రజలయోగక్షేమముల నతిశ్రద్ధతో నరయుచుండు మనప్రభుత్వము తప్పకదీనికి యామోదించునని విశ్వసించుచున్నాను.

సాంఘికదురాచారములు

విద్యార్జనమునందును, నైతికవర్తనమునందును విఘ్నములను గల్గించుచుండుననేక దురాచారములు మనసంఘమునుపట్టి బాధించుచున్నవి. విద్యాప్రబోధముతోబాటు వానినికూడ నిర్మూలన మొనర్చుటకు మనము నడుములు బిగింపవలసియున్నది.

బాల్యవివాహములు

“వివాహోవిద్యనాశాయ” యన్నట్లు విద్యార్జనమునకు భంగమును గలిగించుటయేకాక బాలబాలికల శారీరకమానసికాభివృద్ధులనడ్డగించుచు బాల్యవివాహములు ఘోరదురంతము లాచరించుచున్నవి. స్వయం పోషకత్వమును సిద్ధింపనిదెవ్వరును వివాహమే చేసుకొనగూడదనియు, అట్టినిగ్రహకులు వివాహమాడిన, భార్యలనుమాత్రమే కష్టములపాలుసేయక తాముసు సంసారభారమున క్రుంగుచు నైతికముగ దోషులగుచున్నారనినాఅభిప్రాయము. తగిన విద్యాబలమును, కుటుంబనిర్వాహకశక్తిని సంపాదించక ముందుయువకులు వివాహములాడుట సమంజసముకాదు. బాల్యవివాహములట్టి యనేకాశమును బాలబాలికలనుండి లాగుకొనుచున్నవి. కావున నిజముగా మనము మనసంఘోన్నతిని వాంఛించితిమేని యీబాల్యవివాహములను ఘోరదురాచారముగనెంచి మానుకొనవలసియున్నది. ఈవిషయమునందుకూడ బ్రిటిషు భారతదేశము, కొన్ని ప్రసిద్ధదేశీయ రాజ్యములలోవలెనే మననైజాము ప్రభుత్వమువారు జోక్యము గల్గించుకొని బాలికలకు ౧౪ సంవత్సరములు రాకముందును, బాలురకు ౨౦ సంవత్సరముల వయస్సునకుముందును వివాహములు జరుగకుండునటులు ప్రవేశపెట్టబడిన శాసనమును మనప్రభుత్వము వారంగీకరించుట సముచితముగా నుండగలదు.

స్త్రీపునర్వివాహములు

మనజాతిలోని కొన్నిశాఖలందు పునర్వివాహములు దోషములుగా నెంచబడకున్నను విరివిగాజరుగుటలేదు. ఆజరుగుచున్నవికూడ క్రమపద్ధతిపైలేక “చీరరవిక” “మారుమనుము” అనునాచారముగా మాత్రమున్నవి. కావున నిర్భయముగా శాస్త్రీయమగు పద్ధతిని పునర్వివాహము లాచరించి, బాలికల నైజస్వాభావిక హక్కులగు మాతృత్వ, సుగృహిణీత్వములను గాపాడవలెనని ప్రార్థించుచున్నాను. మఱియు నీనైజాం రాజ్యమునందు బ్రిటిషుభారత ...ము

లోని ౧౮౭౨వ సంవత్సరపు అక్టు 3 వలె పౌనర్భవుల పౌరస్వత్వములును గాపాడుటకొక శాసనముచేయబడు టత్యవసరమైయున్నది. దయామయులగు నైజాముప్రభుత్వము వారీవిషయమున శ్రద్ధవహింపప్రార్థన!

మద్యపానము

ఆర్థికమాంద్యముచే జుట్టబడిన నీకాలమున నిరుద్యోగ సమస్య ప్రబలుటచేతనే యెన్నియోవిధముల తహతహపడుచుండ, దొరకుచున్న ఆ కొద్ది రాబడినికూడ కల్లుసారాయిలన్నత్రాగుటలో కర్చుపెట్టి తినతిండిలేక కట్టుకొన గుడ్డలులేక, ఇంటిపై పెంకులుకూడలేకుండ జేసికొను మతిమాలిన కులసోదరులను జూచి కంట తడిపెట్టనివారుండరు. ఈ దరభ్యాసమువలన ధనవంతులే బీదవారగుచుండ బీదవారిగతి వేఱుగజెప్పవలయునా? ఈ యలవాటు బలమున వేళయైనంతనే దొంగతనమైనచేసి దానినిదీర్చుకొని, తప్పత్రాగి ఒళ్లు తెలియక కాఱులువదరుచు తూలుచు మురికికాలవలలో దొర్లువారును, సిగ్గువిడనాడువారును, కలహములుచేసి శిక్షలకుబాల్పడువారును లెక్కకు తక్కువలేరు. ఈ దురభ్యాసమున్నంతవఱకు మనకునలుగురిలో గౌరవాభిమానములు దక్కుట కల్ల. కావున నీయభ్యాసములున్నవారు తాము దీనిని మానుకొనుటయేగాక తోడిసోదరులనుగూడ దీనిబారినుండితప్పింప ప్రార్థించుచున్నాను. ఈ దురభ్యాసము వట్టియలవాటుగాబోక పర్వదినములందనివార్యమగుచు, పవిత్ర దేవపూజలలోగూడ ప్రాముఖ్యమును వహించియున్నది.

దేవీపూజలు—జీవహింస

అంబ, కాళియను దేవతల నారాధించునప్పుడు కొందఱు మేకలను, గొఱ్ఱెలను, కోళ్ళను, దున్నలను కటికగుండెలతో వధించుచు ఆయా దేవతలు ప్రసన్నములగునని సంతసించుచున్నారు. ఎన్నిప్రయత్నములైన చేసి సత్వగుణమును సంపాదించవలెనని బోధచేయు హిందూమతమున అవిద్యవలన ధర్మముపేరనెన్నిక్రూరకార్యములు జరుపబడుచున్నవి. దేవునికన్నిప్రాణులును సమానము. కావున యికముందట్టి మూఢవిశ్వాసమును వీడి సాత్వికమార్గమున పూజలుసల్పుకొందురుగాకయని హెచ్చరించుచున్నాను-

మితవ్యయము

శుభాశుభకార్యములందు శక్తికి మించినరొక్కమును వెచ్చించియెందరో—ఎందరోయననేల? అందఱును—ఋణములపాలగుచున్నారు. ఒకటి రెండు దివముల తమాషాకొరకు వేలకొలది రూప్యముల ననవసరముగా మంటగలుపుచున్నారు. కావున ప్రతికార్యమునందును మితవ్యయసూత్రమునుదృష్టిలో నుంచుకొని అనవసరపుకర్చులనుచేసి యిల్లుగుల్లచేసికొనకుండుటకు మిమ్మందఱను ప్రార్థించుచున్నాను

ఇతర దురాచారములు

మన సంఘమున పైనచెప్పినవికాక పుష్పాలంకారమహోత్సవము మున్నగు ననేకదురాచారములుప్రబలిమనసంఘమునకు తీరనియపనిందనుగలిగించుచు పరిహాసపాత్రమొనర్చుచున్నవి. అట్టివానినెల్లనునివారించి మనసంఘమును సానబట్టినరత్నమువలె దేదీప్యమానమగునట్లొనర్చుదురు గాక యని ప్రార్థించుచున్నాను.

ఉపసంహారము

తుదకుపై యంశములన్నిటిని శ్రద్ధతో వినినందులకు మీకందఱకు కృతజ్ఞతావందనములర్పించుచు, వానినూరకవిని వదలక వానిపై తీవ్రముగ నాలోచించి తగినరీతి మనకులమును సంస్కరింపగలరని విశ్వసించుచున్నాను. మన సంఘముకొరకుకూడ తగినవసతులేర్పాటుచేయుచున్న బ్రిటిషునైజాంప్రభుత్వములకు గృతజ్ఞతదెలుపుచు నూతనచక్రవర్తులగు ఎనిమిదవ యెడ్వర్డుగారికిని, శ్రీనిజాం ప్రభువర్యులకును, రాణిగారికిని, రాకుమారులకును, రాకుమార్తెలకును, పరమేశ్వరుడు సర్వసౌఖ్యములొసగుగాకయని ప్రార్థించుచు ముగించుచున్నాను.



డాక్టర్ తులా కనకసుందరంగారు
మొదటి మున్నూరుకాపు మహాసభకు అధ్యక్షులు



లక్ష్మణరావు సత్తూరుగారు
(పూనా క్యాంపు యడ్యుకేషన్ సొసైటీ వర్కర్)
వీరు మున్నూరుకాపులు సికింద్రాబాదులో జరుగు ద్వితీయమున్నూరుకాపు మహాసభయందు ఆదరముతో బొంబాయినుండి ప్రతినిధిగావచ్చినారు.

## కీ. శే. శ్రీ ఆంధ్రగంధర్వ జొన్నవిత్తుల శేషగిరిరావుగారు

జూన్ యేడవ తేది ఆదివారము నాడు ఆంధ్రనాటక రంగములోనుంచి ఒకచుక్క రాలిపోయింది. దీనివల్ల అంధకారం వ్యాపించింది. ఆనాడు బందరులో శ్రీ ఆంధ్రగంధర్వ జొన్నవిత్తుల శేషగిరిరావుగారు అకస్మాత్తుగా పరమపదించారు. ఆనాడు తెల్లవారుఝామున రెండుగంటలవరకు తమ గానామృతంతో స్నేహితులతన్మయులని చేసి అంత హఠాత్తుగా కొన్నిగంటల్లోనే మాయమయిపోవటం ప్రకృతి కాఠిన్యం. ఎంతో సంతాపకరం.

శ్రీ జొన్నవిత్తులవారు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతివహించిన మైలవరం కంపెనీ స్థాపకుల్లో ఒకరు. ఈకంపెనీని స్థాపించి సుమారు ౧౬-౧౭ సంవత్సరాలు కంపెనీ బాగోగులకై యెంతొ తెగకుండా కృషిసలిపారు. ఆకాలంలో మైలవరం కంపెనీఅంటే జొన్నవిత్తులవారే ముందు జ్ఞాపకంవచ్చేవారు. మైలవరంకంపెనీ అంతయశం సంపాదించటానికి జొన్నవిత్తులవారు కూడా యెంతో బాధ్యులు. శ్రీ శేషగిరిరావుగారు చిన్నవాటినుంచే నాట్యకళోపాసకులు. బాల్యంలోనే అనేక పాత్రల ధరించేవారు. ముఖ్యంగా ప్రహ్లాదుడు, కృష్ణుడు, లవుడు వీరి అభిమానపాత్రలు. వయసు ముదిరినతరువాతకూడా వీరు కృష్ణపాత్రని యెంతో చక్కగా నిర్వర్తించేవారు. కొన్ని సంవత్సరాలకుపూర్వం సతీ సక్కుబాయి నాటకం హైదరాబాదు, సికింద్రాబాదుల్లో వరుసగా యెన్నోరోజులదాకా ప్రదర్శింపబడినది. ఆనాటకం ప్రజల్ని అంతగా ఆకర్షించటానికి ముఖ్యమైన కారణాల్లో ఒకటి శ్రీ జొన్నవిత్తులవారి కృష్ణపాత్ర నిర్వహణమని చెప్పవచ్చును. ఈపాత్రను యింతచక్కగా నిర్వహించగలవారు చాలా అరుదు. వారు పాడినపాటలు యిప్పటికీ లోకులు ఆలాపిస్తుంటారు. కృష్ణపాత్రయేగాక దుష్యంత, సత్యవంత, దుర్యోధన, సారంగధర, నారద, లవుడు మొదలైన పాత్రలనుకూడా యెంతో చక్కగా నిర్వహించగలిగిన నైపుణ్యం కలవారు. వీరిగానం చాలా మధురమైంది. కంఠం కడు శ్రావ్యమైంది. గానం శాస్త్రీయమైనది. సంగీతంలో పేరుబడసిన శ్రీ బాలగంధర్వగారు కూడా శ్రీ జొన్నవిత్తులవారి గానామృతాన్ని గ్రోలి యెంతో ప్రశంశించారు. కర్ణాటకహిందుస్థానీ సంగీతాన్ని యింత సామర్థ్యంతో పాడగలవారు ఆంధ్రనటుల్లో చాలా తక్కువ. మొత్తముమీద శ్రీ శేషగిరిరావుగారు ఆంధ్రగంధర్వ యనే తమ బిరుదాన్ని సర్వవిధాల సార్థకపరచుచున్నారు.

ఇటువంటి నటకోగ్రేసరులు అకాల మృత్యువాతబడటం చాలా మనస్తాపకరమైన విషయం. సికింద్రాబాదు హైదరాబాదుల్లో కూడా వారికిన్ని హితులు చాలామంది యున్నారు. శ్రీ జొన్నవిత్తులవారి బంధువులకునూ మిత్రులకునూ మనఃశాంతి కలుగుగాక!

ఒక కళాభిమాని.

---

## గ్రామ్యపు దెలుగు బహిష్టయైన తల్లి

### కీ॥ శే॥ వేదము వెంకటరాయ శాస్త్రి గారి అభిప్రాయము

గుఱ్ఱం వెంకటసుబ్బారామయ్యగారు, యం. ఏ. "స్వతంత్ర" పత్రికలో తమకు కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారితో గల పరిచయ విశేషములను వర్ణించుచు నొకసందర్భమున నిట్లు వ్రాసినారు:—

శాస్త్రిలవారికి చెన్నపురమున ఆంధ్రసారస్వత మహాసభవారు మహామహోపాధ్యాయ బిరుదమును ౧౯౧౦౧౧తో గూడ నొసంగి సత్కరించిన కొత్తలో నెల్లూరు మండలీయుల పక్షమున నొక సన్మానసభ జరుపబడెను. పచ్చయప్ప కళాశాలావరణములో జరిగెను. శ్రీవావిలికొలను సుబ్బారావు పంతులుగారు అధ్యక్షతవహించిరి. అధ్యక్షులు శాస్త్రిలవారి వభినందించుచు గ్రామ్యవాద విప్లవము నెదుర్కొనుటయందు తామును శాస్త్రిలవారును జోడు జోడులై సలిపిన సమరమును వర్ణించిరి. దీనినే తరువాత శాస్త్రిలవారు ఇట్లుపన్యసించిరి.

"సంస్కృతము మనకు అమ్మమ్మ, అవ్వ. తెలుగు మనతల్లి. గ్రామ్యపు దెలుగుగూడ మనతల్లియే, కాని బహిష్టయైనతల్లి, అమాత్రమున మనకామెయెడ ప్రేమతగ్గదు. ఐనను అవస్థా విశేషమువంటిది తల్లి నెట్లో గ్రామ్యభాషను అట్లే యొకింత దూరముగా నుంచవలెనిచ్చును, ఇదినా యాశయము గావున గ్రామ్యభాషయనిన నాకు ద్వేషమని గ్రామ్యవాదులు భ్రమింపకుందురుగాక."

---

## ప్రకటన

ఇందుమూలముగా అందరికిని నాదుకాణములో నగదు లేక బట్టలు మొదలగు సరకులు ఖరీదుబాబతు లావాదేవిగల ఆసాములకున్ను నేనుఖరీదుచేసే, సికింద్రాబాదు, గద్వాల, వనపర్తి, బొంబాయి యిలాకా పూనా, మహబూబునగర్ వగైరాజిల్లాలు నిజాంరాష్ట్రము లోనివారికి తెలియజేయునదియేమనగా,

నా కుమారులలోనొకడు జన్ను పెద్ద రంగయ్య కొద్దికాలమునుండి నాతో కలహించి నాస్థిరచరాస్తులను నష్టపరచుటకై విక్రయము, గిరివి వగైరాలు చేయుటకున్ను నాబాకీదార్లవద్దకు వెళ్లి నాకు బాకీవున్న రూపాయలు వసూలుచేసుకొని నాఖాతాలువుండేదుకాణములలోను నాపేరుతో బట్టలు పెట్టెలువగైరాలుఅప్పుతీసుకొనినన్ను నష్టపెట్ట బూనుకున్నట్లు తెలిసినది. అతను అట్లుచేయుటకు యేలాటి హక్కున్ను లేదు. గనుక నాతోలావాదేవి సంబంధముగల యావన్మందిసదరు రంగయ్యతోనుసంబంధమైన వ్యవహారములు చేయకూడదు. ఆప్రకారము చేసేయడల నాకెమియుసంబధములేదు. ఆ నష్టలాభములకు అతనితోనేమీరు వ్యవహరించుకోవలసియుంటుంది. అతనితో మీరుపొందినరసీదులుయెంతమాత్రము నన్ను జవాబుదారినిగా చేయవనిన్ని సదరుప్రకారము జాగ్రత్తగా యుండగలందులకు తెలియజేయనైనది. ఇట్లు

జన్ను పెదకురుమయ్య వ॥ చన్నయ-

సాకిన్ మహబూబునగర్

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H E H The Nizam's Dominions.




Vol. 11. | Thursday 25—6—1936 | No. 14

# వర్ణాంతర వివాహములు సక్రమములైనవే

3

వ్యాసకర్త

## డాక్టర్ భగవానుదాసుగారు

వర్ణాంతర వివాహములుగూడ సక్రమమైనవేయని పాటించుకొరకు మాత్రమే యీచట్టము ఉద్దేశింపబడినది. నిర్బంధముగాని నిషేధముగాని లేదు. ఇది వివిధవర్ణములవారికి సంబంధ బాంధవ్యములను రక్తసంబంధములను కల్పించి ఎక్కువ అన్యోన్యానురాగములను సఖ్యమును కలుగజేయును. ఆడపిల్లలకు సంబంధములు లభించక తల్లిదండ్రులు చిక్కుపడుచుండుటయును లేదా వరులకు వధువులు లభించక చిక్కుపడుటయును, అందువల్ల మితిమీరిన కట్నములను వరశుల్క కన్యాశుల్కములను చెల్లించి సంసారములు గుల్లచేసుకొనుట అంతరించును. వర్ణాంతరవివాహములుకూడ సక్రమమైనవేయని శాసనప్రోక్తముగా పాటించుయెడల, వివాహ సంబంధముల కొరకై చిక్కుపడ నక్కరలేదు. వధువులకుగాని, వరులకుగాని విశాలావకాశముండగలదు. కొన్ని వర్ణములలోని అంతశ్శాఖలయందు ఆడపిల్లలు విరివిగా లభింపక యున్నారు. కారణమేమనగా కొన్ని పురుషాంతముల క్రిందట ఆశాఖలో పుట్టిన ఆడపిల్లలను పురిటిలోనే చంపివేయుచుండిరి. ఈక్రూరమైన ఆచారము చాలవరకు అంతరించినది. కాని పురిటిలో పుట్టిన బిడ్డలను నశింపజేయుట చాల సులభమైన పనియగుటవల్లను, అతిరహస్యముగా జరుగగల పనియగుటవల్లను ఇప్పటికిని ఇంకను అట్టి స్త్రీ శిశుహత్యలు జరుగుటలేదని మనమెట్లు చెప్పగలము? ఆడపిల్లలకు వివాహములు జరుగుట కష్టసాధ్యమనే భీతివల్లనే ఆట్టిహత్యలు ఆయాశాఖలలో జరుగుచుండెను. ఈశాసనము అమలులోనికి వచ్చేయెడల వర్ణాంతర వివాహములుకూడ పరిపాటియై క్రమేణహిందూసంఘమందు పాటింపబడి కన్యకలకు వివాహసంబంధముల అన్యవర్ణములలోనైనను తప్పక లభింపగలవు. కనుక, వారివివాహ విషయమై పెనుభూతముగా తలిదండ్రులకుండజాలదు. ఈచట్టము అమలులోనికివచ్చెయెడల అపభ్రంశమైన వివాహధర్మవిషయములు తొలగిపోగలవు. సహేతుకమైన ధర్మమే వేదధర్మము. కనుక జాతీయ వికాసపరిపూర్తి కుపకరించెడి దేహవికాసమును బుద్ధివికాసమును సాధింపగలమార్గములను బోధించెడి నియమధర్మమే వేదధర్మము గనుక, అట్టి నిర్దుష్టమైనధర్మమునే ప్రజలు గ్రహించి వివాహసంబంధములను నిర్ణయింపగలుగును.

"యః తర్కేణానుసంధత్తే
సధర్మం వేద నేతరః"

మనుస్మృతి

ఈచట్టము అమలులోనికి వచ్చినంతమాత్రమున హిందువులందరును వర్ణాంతర వివాహమును చేసికొని తీరవలెనను నిర్బంధము ఉండదు. ఎవరైనను వర్ణాంతరవివాహమును చేసికొన్నయెడల అట్టివారు సంఘబాహ్యులుమాత్రము కాజాలరు. అట్టివారు సంఘబాహ్యులని తదితరులెవరైన నిందించినయెడల, నిందించినవానివల్ల తనకు పరువునష్టము కలిగినదని అతడు దావా చేయగలుగును.

నేటికాలపు నవీనపరిస్థితులలో యువతులను యువకులును కాలేజిలలో కలిసి చదువుకొనుచున్నారు. ఆట్టి సహాధ్యయనమువల్ల యువకులను పరస్పరానురాగబద్ధులై వర్ణాంతరవివాహ [illegible] నియమములవల్లను హిందూసంఘముయొక్క కట్టుబాటులవల్లను నైరాశ్యమనోవ్యథలనుభవించుచున్నారు. యువకులకు సంక్షోభింపకుండ వర్ణాంతరవివాహములైనవారు చేసికొనవచ్చునని శాసనప్రోక్తముగా పాటించుటకై ఈచట్టము తోడ్పడగలదు.

ఆడపిల్లలకు స్వవర్ణస్వశాఖవరులు లభించుట దుష్కరమగుటవల్ల విపరీతమైన కట్నములను చెల్లించి తలిదండ్రులు వివాహములుచేయజాలకయున్నారు. ఆట్టిసందర్భములో తలిదండ్రుల మనోవ్యథలకు తామే కారకులమని వివాహప్రాయమైన ఆడపిల్లలు తరచు ఆత్మహత్యలను గావించుకొనుచున్నారు. అందుకొరకై నిరర్థకమైన వివాహసంబంధనియమములు వదలి తొలగిపోవలెనను అందుకొరకై యీచట్టము ఉపకరించును.

ధర్మశాస్త్రవిధులను యీచట్టము అతిక్రమించుటలేదు. ఇప్పుడు హిందూసంఘమున చెప్పబడేదిఏదికలదో దానినే మనధర్మశాస్త్రములు "మానవసమాజ" మని పేర్కొనియుండెను. మానవసంఘము ఉత్తేజవికాసములను పొందుటకు తగిన ధర్మసూత్రములనే స్మృతులు విధించియుండెను. కాని సాంఘికధర్మములైన ఆ మూలసూత్రములను మనము మరచియున్నాము. పెక్కుశతాబ్దములనుండియు మనము పెడత్రోవలద్రొక్కియున్నాము.

## ధర్మశాస్త్రములు వర్ణాంతర వివాహములకు ఆమోదించుచునే యున్నారు

భారతీయులు స్వతంత్రజాతివారైయుండిన ప్రాచీనకాలమునందు వర్తింపజేయబడిన ఏధర్మశాస్త్రములుకలవో వాటిని మనము పరిశీలించిచూచినయెడలను, అట్టిస్మృతులలోని వాక్యములను సరిగా అన్వయించినయెడలను వర్ణాంతరవివాహములు ఆకాలమందు ఆమోదింపబడినవనియే తెలియగలదు. వాద తర్కములవల్ల సహేతుకమైనదానినే సనాతనసద్ధర్మముగా గ్రహింపదలంచినవారికి పూర్వధర్మశాస్త్రవిమర్శతో పనిలేదు. వర్ణాంతరవివాహములను చేసికొనవలసినదిగా యీచట్టమెవరినిగూడ నిర్బంధింపజాలదు. కాని వర్ణాంతరవివాహములను చేసికొనినవారిని హిందూసంఘబాహ్యులనుగా తరిమివేయక వారినిగూడ హిందూసంఘములో చేర్చుకొనియుంచుటకై యీచట్టము యత్నించుచున్న వారికిగూడ తదితరులతోపాటు సాంఘిక ప్రపత్తి నొసంగుటకు యత్నించుచున్నది. వారు సంఘబాహ్యులని హిందూసంఘములోనుండి తరిమివేయుటవలన ఒక్కొక్కప్పుడు హిందూసంఘమునకు నష్టకరమగును.

అయితే యీసందర్భములో ఒకవిషయమును గమనించవలెను. వర్ణాంతరవివాహములు విశేషంగా జరుగునని తలంపబడలేదు. చాలమంది తమకుతెలిసిన స్వశాఖీయుల కుటుంబములతోనే వైవాహికసంబంధ బాంధవ్యములను చేయుచుందురు. కాని అప్పుడప్పుడు కదాచిత్తుగా కొన్ని వర్ణాంతర వివాహములు జరుగుచుండును. ఇది క్వాచిత్కము కాదను అపరూపము కైనను మన సాంఘిక వివాహధర్మనియమము లెంత విశాలావకాశము గలవో యెంతసమంజసమైనవో విశదము చేయుచుండగలవు.

## కులములు, శాఖలు, అంతశ్శాఖలు

ఒకకులములో చేరిన వివిధశాఖలవారుకూడ పరస్పరము వివాహ సంబంధములను చేసికొనుటలేదు. వేర్వేరు శాఖలవారు చేసికొనెడి వివాహములుకూడ "అసవర్ణ వివాహములు" గానే పరిగణింపబడుచున్నవి. దేశాచార సంప్రదాయములనుబట్టి వివాహములు సక్రమమైనవా అక్రమమైనవా యని నిర్ణయించేయెడల, శాఖాంతర వివాహములను వర్ణాంతర వివాహములవంటివే యని తీర్పు చెప్పవలసివచ్చును. అందును చెల్లకూడనివేయని నిర్ణయించవలసివచ్చును. కాని, శాఖాంతర వివాహములు నిషిద్ధములని శాసించుటకు ఏ పండితుడును ధర్మశాస్త్రప్రమాణములను చూపజాలడు. ఇప్పుడు భారతమందు అమలులోనున్న వివిధశాఖలును తెగలును, నాడులును, మన పూర్వ శాస్త్రగ్రంథములందెక్కడను కానరావు. ఇట్టి అంతశ్శాఖా భేదము లుండవలెనని సమర్థించుటకు కూడా ఆధారప్రమాణములు కన్పించవు. కాని అమలులోనున్న సంఘాచార నియమములనుబట్టిచూడగా, ఒక్కొక్క అంతశ్శాఖ ఒక్కొక్క ప్రత్యేకకులమే యున్నట్లుగా పరిగణింపబడుచున్నది. అంతటి కట్టుదిట్టములు అంతశ్శాఖలకుకూడ ఏర్పడియున్నవి.

## ఆచారభేదములు శాఖాభేదములు వెఱ్ఱిగా పెరిగిపోవుచున్నవి

ఆయాశాఖలవారికి ఆచారభేదములుకొన్ని యేర్పడుటవల్ల శాఖావిభేదములు అర్థములేకుండ పెరిగిపోవుచున్నవి. ఉత్తర హిందూస్థానములో బ్రాహ్మణులలో చేరిన వేర్వేరు శాఖలవారు పరస్పరవివాహ బాంధవ్యములు చేయరు. దక్షిణదేశములో ఉన్నటువంటి పంచద్రావిడులలోకూడ స్వశాఖా వివాహాలే గాని శాఖాంతరవివాహాలు పనికిరావు. సంయుక్తపరగణాలలో అనగా, కాశీ ప్రయాగ ప్రాంతములందు ఒకసామెత కలదు. ఏడుగురు కనూజీ బ్రాహ్మలు చేరితే, వారికి తొమ్మిది వంటపొయ్యిలుండవలెను. ఒకరుచేసినవంట ఇంకొకరికి పనికిరాదు. కారణమేమనగా వారిలో అన్ని అంతశ్శాఖావిభేదములు కలవు. ఇదేవిధముగా గుజరాతు రాష్ట్రములో కూడ ఒకసామెతకలదు. పదుముగ్గురు గుజరాతీబ్రాహ్మలు చేరితే 33 వంటపొయ్యిలుండాలి.

మన శాస్త్రములలోనే నానావిధములైన వివాహములు చెప్పబడియున్నవి.

అట్టివివాహ దాంపత్యములవల్ల కలిగిన సంతానము అనితరగతులుగా పేర్కొనబడియున్నది. కాని నేటికాలమున అనేకవిధములైన వివాహములు అమలులో నున్నవి. సవర్ణులైన హిందువులలో నొకడు వితంతువైన తన కోడలిని వివాహమాడగా, అట్టివివాహము చెల్లదగినదేయనియు, సశాస్త్రీయమైన హిందూ వివాహమే యనియు ఇటీవల కోర్టు హైకోర్టువారు తీర్పుచెప్పియుండిరి. ఇద్దరుముగ్గురు సోదరులుకలిసి ఒక్క భార్యనే వివాహమాడునట్టి ఆచారముకలదు. మరికొన్ని జాతులవారిలో ఒకనిభార్య నింకొకడు మార్చుకొనుచున్నాడు.

అగ్రకులములవారిలో మరొకవిధమగు వైపరీత్యముకూడ కన్పించుచున్నది. ఆయోధ్యప్రాంతమందు నివసించు పంచగౌడ బ్రాహ్మణులలోచేరిన పంక్తిపావను లనెడివారు కలరు. ఎవరైన నీమాత్రపుస్వల్పాచార నియమములను ఉల్లంఘించినప్పటికిని వెలివేయబడుచూవచ్చిరి. అందువల్ల యీపంక్తిపావనుల కుటుంబములు అంతకంతకు తగ్గిపోయి కొలదిగా మిగిలియున్నవి. వీరిలో సంబంధ బాంధవ్యములకు విశాలావకాశము లేకపోవుట [illegible] కులకూడ వివాహములు చేసికొ[illegible] మామూలుగా నిషేధింపబడిన వా[illegible] కూడ వీరుపాటింపక వివాహములు [illegible] చున్నారు. మలయాళప్రాంతములో తప్పు పాక్కు కుటుంబములోని ఆడు[illegible] లైయున్నది. మలయాళములోని బ్రాహ్మణ వివాహాచారములకును ఉత్తరదేశములోని బ్రాహ్మణుల వివాహాచారములకును పోలికలేదు.

ఈవిధముగా వివాహాచార సంప్రదాయములు పరిపరివిధములుగా దేశమంతటను ప్రబలియున్నవి. అందువల్ల యీచట్టము అమలులోనికి వచ్చేయెడల, వివాహసంబంధ బాంధవ్యములగూర్చిన ఆచార ధర్మములన్నియు సులభమైన సమాన ధర్మములోనికి పరిణమించగలవు. అట్టి సర్వజనావలంబనీయమైన సమాన వివాహధర్మము వర్తింపకూడదని వాదించేవారందరును తమ పూర్వాచార పద్ధతులనే నిరాటంకముగా నిరాక్షేపణగా అవలంబించుచుండవచ్చును.

## భర్తయొక్క కులమునే భార్య అవలంబించినదగును

వర్ణవ్యవస్థ వృత్తిభేదముకొరకై ఏర్పడినదను సిద్ధాంతమును నేను నమ్మియున్నాను. కనుక ఒకవర్ణమునకు చెందినవాడు మరొకవర్ణములోని పిల్లను పెండ్లాడినయెడల, భర్తయొక్క కులవృత్తినే భార్య స్వీకరించినట్లగును. భర్త ఏకులమువాడో భార్యకూడ ఆకులములోనే చేరినదగును. భర్తకు భార్య సహధర్మచారిణి యను సిద్ధాంతమును అనుసరించియే పై విషయమును నిర్ధారణచేయుచున్నాము. భర్తయొక్క యింటిపేరు లన్నింటిని భార్య చక్కబెట్టుచుండును. కనుక భర్తయొక్క సంపత్తికిగాని, జీవనోపాధికిగాని, ఆమెకూడ తోడునీడయై యుండును.

[illegible] వ పేజి చూడుడు

Printed and Published by B. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.